84

అక్టోబర్ 1978

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

"....చైనా మధ్య దక్షిణ ప్రాంతాల నుంచి, ఉత్తర ప్రాంతాల నుంచి, కోట్లాది రైతులు ఒక ఉప్పెన లాగా లేచి...." 'లాంగ్‌మార్చ్' చేసి జన చైనాలో నూతన ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుకున్న విప్లవ విజయ దినం అక్టోబర్ 1.

కోట్లాది భారత ప్రజల కోర్కెలకూ పోరాటాలకూ ఆ గెలుపు ఒక పిలుపుగా ఒక చేయూతగా, ఒక ఊపుగా ఒక ఉత్తేజంగా వుంటుందని ఆశిస్తూ చైనా ప్రజా విజయానికి మా జేజేలు చెప్తున్నాం.



హింసాహింసలు
సంపాదకీయం

ఘాటెక్కే గంధక ధూమం
పెద్ద కథ — బి. టి. రామానుజం

---

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1.50 పైసలు

## సాహిత్య లేఖలు - విమర్శలు :

"చావు కూడ బ్రతుకు కన్న విలువైన త్యాగంగా...." కథమీద వచ్చిన విమ
చర్చలు చదివి విమర్శలన్నీ ఒకే దృక్కోణము నుండి, చిన్న విషయాలకు అన
విషయాలకు ప్రాధాన్యతనిచ్చే విమర్శలని భావిస్తూ ఈ లేఖ రాస్తున్నాను.
పెంచడం ఇష్టం లేకున్నా అవసరమనుకొన్నాను.

ఒక కథలోని అనవసర, అవసర విషయాలల్లో అనవసరమైన పాయింటు
పట్టుకొని చర్చ చేస్తే కథయొక్క మౌలికమైన విషయము (థీమ్) మరచిపోవడమె
లేక దాని ప్రాధాన్యతను గుర్తించక పోవడమో జరుగుతుంది. అలాగే ఏదో చిన్న
విషయాన్ని పట్టుకొని లాగి, గుంజి, దానికి లేని ప్రాధాన్యతను ఇవ్వడం అసలు వి
నాలను విడిచిపెట్టి తాలూతప్పలే పండినాయనుకోవడమే.

కథలో వస్తువు విప్లవ రాజకీయాలతో సంబంధమున్న ఓ ఊరిలో ప్రజల ఆలో
చన లెలావుంటాయి అనేది. ఈ విషయం కాకుండా సామాన్య ప్రజానీకానికి విప్ల
కారుల ప్రభావం ఏవిధంగా వుంది. విప్లవకారుల ప్రేరణ ఎంతవరకున్నది అనేదే
ఈ విషయాన్ని రచయిత సమర్థవంతంగా చిత్రీకరించాడు. ఆ చిత్రణ ద్వారా, ఒక
స్పందన ప్రేరణ, అనుభూతిని పాఠకులకు ఇవ్వడంలో విజయవంతం అయినాడు.
ఈ విషయం ఒప్పుకోవాల్సిందే.

ఇక విమర్శ ప్రధానమైన విషయం విడిచి అప్రధానమైన తాళిబొట్టు భూస్వామ్య
సంస్కృతి గూర్చి చర్చించినారు. ఈ రకంగా చెయ్యడం ద్వారా కథ యొక్క అసల
విషయం మూలనపడ్తుంది. పై ఆధారంలో మొత్తం కథనం పరిశీలించకుండా పాక్షి
దృక్పథంతో రచయితను ఫ్యూడల్ భావాల రచయితగా చిత్రించారు.

ఫ్యూడల్ భావ ప్రచార కథలకి సృజనాత్మక ప్రజల కథలకి తేడా తెలియ
స్థితిలో విమర్శలు సాగడం శోచనీయం.

- ఏల్పుల సమ్మయ
కరీంనగర్

8-9-78

సెప్టెంబరు 'సృజన'లో నా 'యువస్వరాలు' గేయంపై అజ్ఞాత సూరీని విమర
చూసాను. 'ఆంధ్రజ్యోతి' నేను చూడలేదు. ఆ గేయంలో 'అన్నిటినీ రెండుగ
చీల్చినట్లే- మమ్మల్ని రెండుముక్కలుచేస్తాం' ('మిమ్మల్ని' అని ప్రచురింపబడినట్లుకాక
అని ఉండాలి. ఇది అచ్చుతప్పు మాత్రమే. ఇది ఎలా జరిగిందో నాకు తెలియదు.

ఇదే సందర్భంగా 'జులై' సృజనలో "సోషాలజీ అండ్ లిటరేచర్" ఆధారం
ప్రచురించిన 'రమ'గారి "సాహిత్య 'స్వాతంత్ర్య' వాదం" పై ఒక అభిప్రాయం
ఆ వ్యాసంలో ఆర్థిక పునాదికీ, సాహిత్యానికీ మధ్యగల సంబంధాల గురించి రచయి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

84

అక్టోబర్ 1978

ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల
పల్లె ప్రజల బతుకునీ, బాసనీ
కన్నీళ్ళనూ, పోరాటాలనూ
చిత్రించిన జరుగుతున్న జనం కథ

## కొలిమంటుకున్నది

ఆల్లం రాజయ్య

నవల

సృజన నవంబర్ సంచిక నుంచి మొదలవుతుంది.

ఇప్పుడే చందాదారులుగా చేరి మీ కాపీ రిజర్వుచేసుకోండి.

నిర్వాహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1-50 పైసలు

# సృజన

అక్టోబర్ 1978 | మాస పత్రిక | 84



వచ్చే సంచికలో

కరీంనగర్ జిల్లా పోరాట పాటలు

ఎన్ ఎస్ ఎస్ చేపట్టిన వయోజన కాదు వయోభార విద్య

విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?

చర్చకు సమాధానం.

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

నిర్మాణయుత కార్యకలాపాలు చేపట్టి హింసను విడనాడ వలసిందిగా నక్సలైట్లకు హితవు చెప్పాడు చెన్నారెడ్డి. ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల్లో ప్రజలు నిర్మాణయుత కార్యకలాపాలు చేపడితే హింసను అమలు చేస్తున్నది చెన్నారెడ్డే. 'భూస్వామ్య విధానాన్ని రూపుమాపుతామని నక్సలైట్లు కంకణం కట్టుకున్నారు- నక్సలైట్లను రూపుమాపటానికి నేను కంకణం కట్టుకున్నాను' అని నిస్సిగ్గుగా అసెంబ్లీలో ప్రకటిస్తే, అయితే భూస్వామ్య విధానాన్ని కాపాడతానని ప్రకటిస్తున్నావన్న మాట అని ఒక్క ప్రతిపక్ష సభ్యుడు కూడ ప్రశ్నించలేదు. ఏమయితేనేం, తాను భూస్వామ్య విధానాన్ని కాపాడడానికే ఉన్నానని కల్లాకపటం లేకుండా వెళ్ళబెట్టాడు ముఖ్యమంత్రి. అందుకే చినమెట్‌పల్లిలో ప్రజలపై కాల్పులు జరిపిన దొరను దొర ఆస్తిని కాపాడడానికి పోలీసు క్యాంపులు పెట్టాడు- లోతునూరులో ప్రజల దగ్గర లంచాలు గుంజుకున్న దొరతో అవి కక్కించకుండా కాపాడడానికి పోలీసు కాల్పులు జరిపించాడు. జగిత్యాల, మెట్‌పల్లి తాలూకాల్లో 150 గ్రామాల్లో పోలీసు క్యాంపులు పెట్టించి వందలాది మంది నిరుపేద రైతులను అరెస్టులు చేయించాడు. అక్కడ గ్రామాల్లో 144 సెక్షను, రైతాంగంపై లాఠీ చార్జీలు, తప్పుడు కేసులు నిత్యకృత్యమైపోయాయి.

నిరాయుధులైన ప్రజలొస్తే ఆత్మరక్షణ చేసుకోవడానికి దొరదగ్గర పన్నెండు బారుల తుపాకి వుంటుంది. ప్రజలు రాళ్ళు రువ్వారని నెపంపెట్టి కాల్చడానికి పోలీసుల దగ్గర సరేసరి, తుపాకులుంటాయి. ప్రజల దగ్గర పోగొట్టుకోవడానికి 'పోశడు' లాంటి నిరుపేద రైతుకూలీ ప్రాణాలు మాత్రమే వుంటాయి. పోశి, పోశడు ఇంకా పోచమ్మ, పోచయ్యలు కూడ కాని సమతా రాజ్యం మనది! తలదాచుకోవడానికి గుడిసె, జానెడు కడుపు నింపుకోవడానికి దోసెడు గింజలు గిట్టే చారెడు నేల కూడ లేని పోశడు, గడీ గోడలలోపల మేడమీది కటకీలోంచి తుపాకీ గురిపెట్టే దొరమీద దౌర్జన్యం చేయడం- నిజమే, పాపం దొరలు పోలీసులు ఆత్మరక్షణకే కాల్పులు జరుపుతారు. పేదలకు ఆత్మలు లేవూ, రక్షణా అవసరంలేదు. దొరలకూ, పెత్తందార్లకే ఆత్మలున్నాయి- వాటిని రక్షించడానికికే ప్రభుత్వ బలగాలున్నాయి- పరమాత్ముడూ అందుకే వున్నాడు.

'హింసను హింసతోనే ఎదుర్కొంటాం' అని ప్రభుత్వం ఎందుకున్నదో తన బాధ్యతను చక్కగానే గుర్తించి ప్రకటించాడు మంత్రి రాజారామ్ (మాజీ సోషలిస్టు!) ప్రభుత్వమంటే దానికొక రాజనీతి, న్యాయం, చట్టం, కోర్టులు, విచారణ వున్నాయని ఎవరన్నారో, ఎవరైనా అనుకుంటున్నారో ఒక్కసారి మంత్రిగారి మాటలు ఆలకించండి. అంతేకాదు 'ప్రజల చేతికి తుపాకులు యిచ్చే వాళ్ళమే కాని, అట్లా చేస్తే అంతర్యుద్ధం వస్తుంద'ని కూడ సెలవిచ్చాడు. మంత్రిగారి ప్రజలెవరు? భూస్వాములు- వాళ్ళకు ప్రజల నుంచి 'ఆత్మరక్షణ' చేసుకోవడానికి తుపాకులు యిచ్చేదేదో గానీ ప్రభుత్వం 'అంతర్యుద్ధ భయం'వల్ల ఇవ్వడంలేదు. లైసెన్సులు ఇస్తూనేవున్నది గదా- అయినా

ఆధునికమైన సౌకర్యాలు, నైపుణ్యం అన్నీ అమరిన పోలీసులు అదే సేవలో వుండగా 'భూస్వామ్య ప్రజల' చేతికి తుపాకులెందుకు- (ప్రజలు స్వాధీనంచేసుకునే ప్రమాదం వుంది!)

నక్సలైట్ల కార్యకలాపాల్లో దేశమంతటా మళ్ళా ఎక్కువయ్యాయని అందులోనూ ఆంధ్రప్రదేశ్‌ది అగ్ర తాంబూలమని (ప్రభుత్వ సమాచారమే అనుకోండి) ఎమర్జెన్సీ పౌరహక్కుల చాంపియన్ కులదీప్ నయర్ కూడ రాస్తున్నాడు. ఆయనే ఒక్కసారి ఢిల్లీ, తైలదిల్లా, పంత్‌నగర్ మొదలుకొని ప్రతినిత్యమూ భూస్వాముల అత్యాచారాలకు, దౌర్జన్యాలకు, పోలీసుల కాల్పులకు బలియవుతున్న ప్రజల సంఖ్య ఎంతవుందో ఏమైనా తెలుసుకునే ప్రయత్నం చేస్తే ఎంత బాగుండును.

'ఆ పల్లెలో ఏ యింట్లో కోడి కూసినా అది దొర యింట్లో తెగవలసిందే.' ఇదే జగిత్యాల తాలూకా పల్లె ప్రజల అనుభవం. 'దొర మా గుడిసెలు కాలబెట్ట వచ్చు- మా కష్టం దోచుకోవచ్చు- మా ఆడవాళ్ళను చెరచవచ్చు- మేం మాత్రం మా యింట్లో దీపం కూడ వెలిగించుకో కూడదట-' ఇదే వాళ్ళ ఆవేదన. లేదు, మీ కోడపిల్లలు, ఆడపిల్లలను కాపాడుకోవటమే కాదు, మీ యింట దీపాలు వెలిగించుకొని మీ కళ్ళల్లో కన్నీళ్ళకు బదులు సంతోషాన్ని నింపుకునే హక్కు మీకున్నది- దున్నే వానికే అన్నం తినే హక్కు వున్నది అని ప్రకటించి నందుకే, పోరాడినందుకే ఆనాడు దొడ్డి కొమురయ్యను నిన్న కోరన్న మంగన్నలను, ఇవ్వాళ పోశయ్యలను పొట్టన బెట్టుకున్నది ఈ భూస్వామ్య వ్యవస్థ. వాళ్ళు చిందించిన నెత్తుటిలో నిదుర లేచిందే మొన్న వీర తెలంగాణ పోరాటం, నక్సల్బరీ శ్రీకాకుళాలు ఇవాళ ఆదిలాబాదు, కరీంనగర్ పల్లెల దోపిడీ వ్యవస్థ ప్రజలపై అమలు పరుస్తున్న హింసను ప్రతిఘటించి నిలిచిన ప్రజా పోరాట ప్రతిహింస- విప్లవ హింస.

నిన్న చరణ్‌సింగ్ అయినా ఇవ్వాళ చెన్నారెడ్డి అయినా పీడకుల హింసను మౌనదాస్యంలో ఆమోదించి ప్రతిఘటనా హింసను వదులుకొమ్మని ప్రజలకు హితవు చెప్తున్నారు. మానవత్వాన్ని నాశనం చేసే హింసను మానవత్వాన్ని పునర్నవంచేసే విప్లవ హింసతో ఎదుర్కోవద్దని హెచ్చరిస్తున్నారు- ఒక్క మాటలో హింసను సహించి పడివుండమని చెప్తున్నారు భూస్వామ్య వ్యవస్థ నుంచి భూమిని విముక్తి చేయడం లోనే తమ విముక్తి యిమిడి వున్నదని వర్గచైతన్యంతో గ్రహించిన ప్రజలు ప్రాణాలు తెగించి పోరాడుతారు తప్ప, సహించి పడివుండరు. హింసను సహించేది లేదని ప్రకటించడమే హింస అయితే నక్సలైట్లే ఏమి, అన్యాయాన్ని ప్రతిఘటించే ప్రతి ఒక్కరూ హింసావాదే.

– సంపాదకుడు

6–10–78

# ప్రజా చైతన్యానికి ఇరుసు - భూమి సమస్య

వరవరరావు

(గత సంచిక తరువాయి)

భూమి సమస్యపై ప్రజలు విజయాన్ని సాధించిన ఒక సంఘటన ఈ నవలలో ఒక మలుపు. ఈ మలుపు తొలి విజయాన్ని మాత్రమే కాదు పోరాటంలో తొలి మలుపును కూడ సూచిస్తుంది- ఈ పోరాటానికి కంఠీరవం నాయకుడు- అది కూడ తన అన్నకు, దొరకు వ్యతిరేకంగా నాయకత్వం వహించాల్సి వస్తుంది.

గ్రంథాలయంలో జరిగిన సభలో వెంకటేశ్వరరావు వకీలు చేసుకున్న పరిచయాన్ని బట్టి ఇరవై అయిదు, ముప్పై ఏండ్ల కింద ఆ గ్రామం వదిలిపోయిన బ్రాహ్మణ కుటుంబం అతనిదేనని, అతడే వెంకటేశ్వర్లు అని, కొమురయ్య తండ్రి కోటయ్య కౌలుకుచేసిన భూమి, కొమురయ్య నుంచి దొర లాక్కున్న భూమి ఆ ఇరవై ఎకరాల నిక్షేపం లాంటి భూమేనని ఆరాలు తీస్తే తేలుతుంది.

"కొమురయ్యా! ఇక దొరపని పడ్దాం. చిక్కిందే పిట్ట" అంటూ పట్టలేని సంతోషాన్ని ప్రదర్శించాడు చంద్రయ్య. ఈ విషయం బయటికి లాగడంలో ఇంకా అందరికన్నా చంద్రయ్యే చొరవా, నేర్పూ ప్రదర్శించాడు.

"బాగా యినండి- మన కొమురయ్య నెత్తికొట్టి, గుంజుకున్న ఆ భూమి అసలు ఈ వకీలుగారిది- ఇంక దీంట్లో అనుమానమేమీలేదు- అయితే దొరపేర ఎట్లా పట్టా అయింది ఇప్పుడే తేల్చుకోవాలి- మీకెవరికి కోపంరాకపోతే వకీలుగార్ని ఒకటడుగుతా- ఏన్లేదు- వకీలుగారు మనస్సు గట్టి చేసుకుని మాకు మద్దతుగా ఉంటారా లేదా? అది మొదలు తేలాలె" చంద్రయ్య నేలగుద్ది అడిగాడు.

ఆ గ్రామ రైతాంగం చైతన్యం విద్యావంతుల మేధావుల చైతన్యాన్ని సవాల్ చేసేంతగా పదునెక్కింది- ఆ కత్తికి సానబెట్టింది భూమి- నేల తల్లి.

"చేసేది సానా వుంది- మీరు మాత్రం మీ భూమి ఈ ఊరి దొర పేర ఏట్లా పట్టా అయింది తేల్చుకోవాలె-" "మాటిమాటికి, ఖానూనంటడు మా దొర- మరి మీరు కూడ ఖానూను తెలిసినోరైతిరి- ఆ ఖానూనేందో, అమ్మడమేందో మీరు తేల్చుకోవాలె-" చంద్రయ్య, కొమురయ్యల మాటలివి.

"అసలు ఎవరమ్మింది? సాక్షులెవరు- సంగతేందో తహసీల్ కచేరీకి వెళ్ళి కనుక్కోవాలి" పరంధామయ్య సలహా ఇచ్చాడు.

"మనమనుకున్నవన్నీ దృఢపడితే మీ దొరవారికి మాత్రం మంచి సన్మానం జరిపిస్తాను- చేతులకు బేడీలు తగిలించి బజారు తిప్పకపోతానా? చూడండి. ఇంత పగటి దోపిడిటండీ- ప్రజల ఆస్తులు ప్రభుత్వ చట్టాలు వీళ్ళకు లెక్కలేదే!" వెంకటేశ్వర్రావు అన్నాడు.

"వింటున్నావా బషీర్, ఒక్కొక్కరి సంగతి- మీరు దొంగతనం చేస్తే బెత్తం దెబ్బలు, జెయిలు శిక్షలు- ఎన్నో ఏండ్ల క్రిందట భూమిని తనదని హరించి ఊరు రాజ్యమేలుతున్నాడు- వీళ్ళకు జంకులేదు, పాపభీతిలేదు- ప్రభుత్వ భయంలేదు. వీళ్ళకు శిక్షలేదు, జెయిళ్ళులేవు." కంఠీరవం గంభీరంగా అన్నాడు.

"....ఒకవేళ ప్రతి గ్రామంలోను ప్రజలంతా విజ్ఞానవంతులై కర్తవ్యాన్ని ఎరిగి ఐక్యంగా నిలబడితే ఈరోజు పెద్దలుగా పెత్తనం చేస్తున్నవాండ్లకు అసలు స్థలం జెయిళ్ళు గాక వేరే వుందంటారా?" విజయదేవ్ అందర్నీ కలియచూస్తూ అన్నాడు.

"అయితే ఆ పని మన ఊరు నుంచే మొదలు పెడ్దాం" పరంధామయ్య ప్రతీకారంతో అన్నాడు.

నిజంగానే ఆ పని ఆ ఊరు నుంచే మొదలుపెట్టారు- పరంధామయ్య, వెంకటేశ్వర్రావులు తహశీల్ కచేరీకి వివరాలు సేకరించడానికి వెళ్ళారు. కంఠీరవం తాను గ్రామాన్ని వదిలినప్పటి నుంచి ఈనాటి వరకు గ్రామంలో వచ్చిన మార్పులన్నీ ఎంతో ఆసక్తిగా విన్నాడు- జెయిల్లో తాను పొందిన చైతన్యాన్ని చర్చల్లో వాండ్లకు పంచాడు- "హైదరలీ, రాంభూపాల్‌రావుల ఐక్యత మన అందరికీ కనువిప్పుగా వుండాలి- మనం మన సమస్య దృష్ట్యా వ్యక్తులను, ఆశయాలను అర్థంచేసుకోవాలి- అవి ఎక్కడ నుంచి ఏ విధంగా వస్తున్నవో గమనించాలి-" కంఠీరవం కొమురయ్యను సంబోధిస్తున్నట్లు మాట్లాడాడు.

"విద్యా విహీనులని ఎవరినంటామో వాళ్ళలో విషయ గ్రహణశక్తి ఎక్కువగా వుంటుంది" అని కంఠీరవం అంటుండగా నిజామాబాద్ వెళ్ళిన పరంధామయ్య, వెంకటేశ్వర్రావులు వచ్చారు. వెంకటేశ్వర్లు పేరుతో సంతకం పెట్టింది వెంకటాచారి అని తేలిపోయింది- "మీ అన్న తలగొట్టి నడిబజార్లో వేలాడదీసినా పాపం లేదు" అంటూ బుసకొడుతూ కంఠీరవాన్ని ఉక్రోషంతో చూశాడు పరంధామయ్య.

అయినా కంఠీరవం ప్రశాంతంగా వున్నాడు.

"అసలు మొదట వెంకటాచారి కాళ్ళకు తాడుకట్టి చచ్చిన కుక్కను ఈడ్చినట్లు ఈడ్చుకొచ్చి పెడిరెక్కలు గుంజకు కట్టాలి- సిగ్గు లజ్జ బిడియంలేక తనే వెంకటేశ్వ

రావునని చెప్పుకొని కొమురయ్య నోట్లో మన్ను పోశాడు." అందరూ నిర్విణ్ణులయి కంఠీరవమే నేరస్థుడన్నట్లు అతనివైపు చూచారు.

కంఠీరవం అవమానంతో భారంగా తల నేలకువేసి కూర్చున్నాడు- "మీరు చేయమన్న పని చేయడానికి నేను సిద్ధంగావున్నాను- నేను నా అన్న విషయంలో అభిమాన పడతానని మీకెవరికీ సంకోచం వుండనక్కర లేదు- వున్నదని కూడ నేననుకోను- నాకూ, నా అన్నకూ పుట్టుకతో ఏర్పడిన సంబంధం తప్ప వేరే ఏమీలేదు.... ఈరోజు నా అన్నయ్య చేసిన అన్యాయానికి శిక్షగా నా అన్నయ్యను న్యాయస్థానానికి అప్పజెప్పి అతని పాపాన్ని లోకానికి తెల్పడం కూడ నాకు గర్వకారణమవుతుంది-" కంఠీరవం గంభీరంగా అన్నాడు. "మీ అన్న చాలా పెద్ద మనిషి ఉన్నట్టుంది మారాజ్" అని బషీర్ అడిగిన మాటలకు వ్యంగ్యంగా "అవును మా కులం పెద్దది- చేష్టలు బుద్ధులు కూడ పెద్దవి" అని కూడ అంటాడు

రామభూపాల్‌రావు, వెంకటాచారిలను నిర్బంధింపచేయాలని అంతవరకు చాల జాగ్రత్తగా వ్యవహరించాలని అనుకొన్నారు- అప్పుడు దొరకు సాయంగా దొంగ సాక్ష్యాలిచ్చిన తిరపతయ్య, పాపయ్యలు ప్రజల పట్టయ్యారు- అంతా కలిసి నిజామాబాద్ న్యాయస్థానానికి వెళ్ళారు- వెంకటేశ్వర్రావు న్యాయాధిపతిని ప్రత్యేక గదిలో కలుసుకొని వివరంగా విజ్ఞప్తిని సాక్ష్యాల పట్టికనూ అందచేశాడు.

న్యాయాధిపతి సర్దుబాటు చేయాలని ప్రయత్నించాడు-

"మనుష్యుడున్నప్పుడు తప్పులు జరుగుతుంటాయి- సదురుకొని పోతుండాలె- మీరా చదువుకున్నవాండ్లు. బస్తీలో వుంటుంటారు- మీకేవిధంగానూ కాలంగడుస్తుంది. కానీ ఈ విధంగా ఉన్నవాళ్ళే కక్షలు పెంచితే అన్యాయంగా అమాయక ప్రజలు అవస్థల పాలవుతారు-" అని న్యాయాధిపతి హితవు చేయబోయాడు.

"దొంగ సాక్ష్యాలతో ఇతరుల భూమిని దిగమింగి పెద్దమనిషిగా ఊరేగుతున్నప్పుడు, ఆ విషయంలో చర్య తీసుకుంటే గ్రామ కక్షలు పెరుగుతాయని మీరు మమ్మల్ని హెచ్చరించడం నాకు ఆశ్చర్యంగా వున్నది- మేము మిమ్ములను చట్టరీత్యా పొందాల్సిన న్యాయాన్నేకోరుతున్నాం" కృత్రిమ వినయంతో వెంకటేశ్వర్రావు అన్నాడు- న్యాయాధిపతి వైఖరిపై అతనికి కోపం వచ్చింది.

"ఈ అభియోగం యొక్క తీవ్రతను రామభూపాల్‌రావు యొక్క పలుకుబడిని దృష్టిలో వుంచుకొని మీరీ ప్రత్యేక గదిలో విచారణ జరిపి వెంటనే నిర్బంధాజ్ఞలు పంపించాలని కోరుతున్నాను" అని వెంకటేశ్వర్రావు వాదించాడు.

న్యాయాధిపతి నిర్బంధాజ్ఞలు జారీ చేశాడు- జమానత్ తక్సీలు చేసుకోవడానికి కూడ అమీన్ సాయం చేయలేక పోయాడు. రాంభూపాల్‌రావు, వెంకటాచార్లను పోలీసులు ఊళ్ళో నుండి కచ్చడంలో తీసుకపోయారు- గత్తర లేచినపుడు గ్రామాన్ని వదిలిపెట్టి దేవరను సాగనంపినట్లు వుండింది ఆరోజు గ్రామం వాలకం.

అభియోగం విచారణ ప్రారంభమయింది- రామభూపాల్‌రావు, వెంకటాచారిలు హామీపై విడుదల చేయబడ్డా దిమ్మగూడెం వెళ్ళడానికి జంకారు- తోటి పెత్తందార్లంతా తీవ్రంగా ఆలోచించి పెద్ద వకీళ్ళద్వారా వెంకటేశ్వర్రావుపై వత్తిడి తెచ్చి అభియోగాన్ని ఎత్తివేయించాలని ఎత్తులు వేశారు- కానీ అతడు లొంగలేదు- అటు న్యాయాధిపతికి ఇటు పెత్తందార్లకూ ఈ కేసు పరీక్షగా తయారయింది- వెంకటాచార్యులకు మూడు సంవత్సరాలూ రామభూపాల్‌రావుకు ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది.

ఇక్కడే ప్రజలు భూమి విషయంలో విజయాన్ని సాధించడమే కాకుండా వాళ్ళు ఎలాంటి సమష్టి జీవనాన్ని ఊహించుకుంటున్నారో రేఖామాత్రంగా ఆచరించి చూపడం కూడ ఇందులో కన్పిస్తుంది- తోటబావి భూమిని స్వాధీనం చేసుకొని కొమురయ్య వ్యవసాయం సాగించాడు- అంటే వెంకటేశ్వర్రావు తన భూమిని తాను కోర్టుద్వారా విడిపించుకున్నప్పటికీ ఇరవయి, ముప్పయి ఏళ్ళుగా కౌలుచేసి అనుభవిస్తున్న కొమురయ్య హక్కును గుర్తించాడన్నమాట. తమ శక్తి మేరకు 'దున్నేవానికే భూమి' ఆశయాన్ని అమలు చేశారన్నమాట. పాడుబడిన వెంకటేశ్వర్రావు ఇల్లును బాగు చేయించుకొని కంఠీరవం, వెంకటేశ్వర్రావు, బషీరు, విజయదేవ్, పరంధామయ్య అంతా అందులో కలసి వుండసాగారు.

కంఠీరవం ఈ ఆదర్శప్రాయమైన సమష్టి కుటుంబానికి తల్లిగా రమ్మని తన తల్లిని ఆహ్వానిస్తాడు.

"నేనొక్కణ్ణి ఇల్లు విడిచిపోయినందుకు తహతహ పడ్డావుకద అమ్మా నా వంటి వాండ్లు ఇంకా నలుగురు కొడుకుల నీ చల్లని నీడకిందికి తేవాలనుకుంటున్నాను- దీంట్లో నీకు ఆనందమే వుంటుంది కదమ్మా- మాదిగగుంపు అని అంత చులకనగా తీసేయకు- నేనే అంటే నాకంటె ఎక్కువ కష్టాలు అనుభవించి, దిక్కు దెస లేక సద్భావం, సహవాసం అండగా వున్నవాళ్ళు వాళ్ళంతా. నేను జెయిల్లో ఒక స్నేహితుణ్ణి సంపాదించుకున్న. అతదే బషీరు. కోమటిగా పుట్టి తురకగా పెరిగి దొంగగా జీవిస్తుంటే మనిషిని చేద్దామని వెంట తెచ్చుకున్న. విజయదేవ్ చదువుకున్నవాడు- బుద్ధిమంతుడు.

తన విశ్వాసాలకు అందని సమాజానికి దూరమై శిక్షించే ప్రజలను నీతిగల వ్యక్తులను అండగా చేసుకొని ఊరు వదిలి ఇక్కడ వున్నాడు. వకీలు సంగతి వేరే ఏమి చెప్పాల్సింది లేదుకద- అతనికి తల్లిలేదు, తండ్రి లేడు కద- వున్న భూమి కొమురయ్య కిచ్చిండు- అతని ఇంట్లో మేమంతా వుంటున్నాం- ఇక పరంధామయ్య సంగతి, సవతి తల్లి పోరుపడలేక తండ్రి ఆదరం లేక అనాథుడుగా మాలో ఒకడై జీవిస్తున్నాడు- వీరందరికీ తల్లినై బతకడంకంటె నీకు వేరే ఆనందమేముంది- ఇంకో సంగతి అన్నయ్య విడుదల కాగానే నేను ఆయనను దొరతో దూరంచేసి మాలో ఒకనిగా వుంచుకోవాలని అనుకున్నాం."

ఇట్లా గ్రామంలో ఒక సమిష్టి జీవనాన్ని, ఒక ఆదర్శప్రాయమైన నాయకత్వాన్ని, ఉత్తమ సాంఘిక విలువలనూ, ప్రవేశపెట్టడమే కాకుండా కంఠీరవం, బషీరులు, కొమురయ్యకు వ్యవసాయంలో సాయంగా కూడ వున్నారు.

ఆ సమయంలో హైద్రాబాద్ సంస్థానంలో కాంగ్రెస్ పోరాటం కరపత్రాలు వచ్చాయి- జగపతిరెడ్డి నుండి కంఠీరవానికి ప్రత్యేకంగా ఉత్తరం కూడా వచ్చింది- గ్రామజీవితం ఇంకో మలుపు మలిగింది- కంఠీరవం మొదలైన వాళ్ళంతా హైద్రాబాద్ వెళ్ళిపోయారు- వాళ్ళు వెళ్ళిన కొద్ది దినాలకే స్టేట్ కాంగ్రెస్ ప్రథమ సత్యాగ్రహం ప్రారంభమయింది- ఇంతలో రామభూపాల్‌రావు శిక్షముగిసి దిమ్మెగూడెం చేరుకున్నాడు- వచ్చీ రావడంతోనే అధికారవర్గానికి అండగా నిలిచి గ్రామ ప్రజలపై అధికారం చేయడం సాగించాడు- గ్రంథాలయం మూతపడ్డది- వెంకటేశ్వర్రావు ఇంటిలో పోలీసు నాకా పెట్టించాడు-

వెంకటేశ్వర్రావు డిక్టేటర్‌గా బషీరు, కంఠీరవం, పరంధామయ్య, విజయదేవ్ అనుచరులుగా ఒక దళంగా సత్యాగ్రహం చేసి నిర్బంధించబడ్డారు.

కంఠీరవం ఇప్పుడు 'ప్రజల మనిషి' అయ్యాడు- ఇంకా ప్రజా పోరాటాలు నిర్వహించవలసి వున్నది- అటువంటి ప్రజా రాజకీయ పోరాటాన్ని, స్టేట్ కాంగ్రెస్ నిర్వహిస్తుందని ఆశించాడు- అయితే జగపతిరెడ్డి ఉత్తరంలోని అసఫ్‌జాహీ వంశం గురించిన పరమత వ్యతిరేకతతోగానీ, చరిత్రలో కొందరు రాజులు ప్రజలకు మేలు చేశారనే అవగాహనతోగాని ఆయనకు అప్పటికే ఏకీభావం లేదు- మనిషి మనిషిగా జీవించే మార్గమేదో అది ఒకటే గీటురాయని, స్వాతంత్ర్యం అధికారం ఏ ఒకరిసొత్తుగాక ఎల్లరి అనుభూతికీ, ఆచరణకూ అందుబాటులో వుండే సమిష్టి హక్కుగా పరిణమించాలని కోరుతున్నారు- అసఫ్‌జాహి ప్రభుత్వం ముస్లిం ప్రభుత్వమైనందువల్ల

కాదు అందరూ ద్వేషించేది- నిరంకుశ ప్రభుత్వ మైనందున. అయితే ఈ ఊడలు పారిన మర్రిచెట్టు లాంటి ప్రభుత్వాలను పెకలించడం ఒకరిద్దరితో అయ్యేపని కాదని ఈ ప్రభుత్వాలను మార్చడానికి ప్రజలంతా ఒకటయ్యే వరకు ఈ సర్కారోళ్ళు నానా హింసలు పెడతారని అతనికి తెలుసు. వందల ఏండ్ల నుంచి ఇష్టమొచ్చినట్టు ఆటలు ఆడిన ప్రభుత్వం తనకింద అణగివున్న ప్రజలు ఎదురు తిరిగితే ఊరుకుంటుందా? రెచ్చిపోయి పిచ్చిపనులన్నీ చేస్తుంటది- దాంట్లో జెయిళ్ళలో పెట్టడం కూడా ఒకటి- మంచి ప్రభుత్వం వచ్చేదాకా కష్టాలు తప్పవు.

ప్రజల మనిషి కంఠీరవం కలగనే మంచి ప్రభుత్వంలో తల్లిదండ్రులు పొట్ట వెళ్ళక కన్నబిడ్డలను అమ్ముకోరు- అన్యాయంగా ఇతరుల ఆస్తులను ఆక్రమించరు- అన్నంలేదని అరచే వాళ్ళుండరు- చదువురాని వాడుండడు- నీతి, దయ, ప్రేమతో కట్టుగా వుంటారు.

ఈవిధంగా ప్రజల చైతన్యంగానీ, ప్రజల మనిషిగా కంఠీరవం రూపొందే క్రమంగానీ దిమ్మగూడెంలోని భూమి సమస్య ఇరుసుగా తెలంగాణా వాతావరణంలో చిత్రించబడింది. ఇంకా అప్పటికి స్టేట్ కాంగ్రెస్ పుట్టలేదు- కనుక ఇది తొలి విజయమూ, తొలి ఓటమి- ఓటమి, విజయమూ ఓటమి అంతిమ విజయంగా పరిష్కార మయ్యేదే భూమి పోరాటం.

'ప్రజల మనిషి' నవలలో భూమి సమస్య చైతన్యానికి ఇరుసు అనడానికి ఇంత వివరంగా ఉదాహరణలు చూపిన తర్వాత భూమి సమస్యపై రచయిత దృక్పథాన్ని విశ్లేషించడం సులభతర మవుతుంది- ఇందులో భూమిని దొర స్వాధీనం చేసుకున్న ఘట్టాలు మూడు- రఘునాధాచార్యులగారి భూమి దొర స్వాధీనం చేసుకోవడం మొదటిది- కొమురయ్య భూమిని దొర స్వాధీనంచేసుకోవడం రెండవది- చెరువు హక్రాజు ఎప్పుడూ పద్ధతి ప్రకారం జరుపకుండా దొరే అనుభవిస్తూరావడం మూడవది- ఇవి గాక సంభాషణలవల్ల ఆ గ్రామంలో రైతులు భూమి పోగొట్టుకున్న ఉదంతాలు కొన్ని తెలుస్తాయి- ఉదాహరణకు ఒనరయ్య అనే రైతు రకం కట్టలేక కోమటి శంభయ్యకు భూమి అమ్ముకొని ఆయన దగ్గరే జీతగాడుగా మారిపోయాడు- దూదేకులవాళ్ళ భూమిని దాని ధర కట్టివ్వకుండానే హైదరలీ ఆక్రమించుకొని అనుభవిస్తున్నాడు- ఊళ్ళో వున్న ఏనె దొరది- బీడు హైదరలీది- వీటిల్లోకి గొల్లవాళ్ళ జీవాలు పోతే సహించరు.

మరి రఘునాధాచార్యుల భూమిని దొర తీసుకున్న దానిమీద ఊళ్ళో ఎటువంటి ప్రతిస్పందన కనిపించదు- స్వయంగా రఘునాధాచార్యులే యిచ్చింది పీరు, తీసు

కున్నదీ మీరే అంటాడు- ఈ విషయంలో నవలలో ఎక్కడా ఏ పాత్రనోటా నిరసన వినిపించదు- మరి రఘునాథాచార్యులు ఊళ్ళో ఎంతో మన్నన పొందిన ఆచార్య పురుషుడు- తర్వాత కాలంలో వెంకటేశ్వర్లుగా సంతకం పెట్టినందుకు వెంకటాచారికి ఆ భూమి తిరిగి ఇచ్చానంటాడు దొర- వెంకటాచారి ఎట్లాగూ స్వంతంగా సాగుచేయడు గనుక తానే సాగుచేసి ధాన్యంగానీ, డబ్బుగానీ తనకు తోచినంత ఇస్తూవుంటాడు- వెంకటాచారి బాధ్యతలు స్వీకరించే నాటికి అతడు పూర్తిగా దొరకు బంటుగా మారి ఆ వూళ్ళో ప్రజాకంటకుడుగా తయారయ్యాడు గనుక ప్రజలు ఆ సమస్యను పట్టించుకోలేదా? లేక వెంకటాచారి భూమి వెంకటాచారికి తిరిగి ఇచ్చాడు గనుక జనం ఊరుకున్నరా? అయితే రఘునాధాచార్యుల భూమి దొర తీసుకున్నదానికి గానీ, తిరిగి వెంకటాచారికి అది తిరిగి యిచ్చానన్న దానికిగానీ అది ప్రజలకు తెలిసిందన్న దాఖలాలేదు- ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే అసలు నవలలో రఘునాధాచార్యులు భూమి స్వంతంగా సేద్యం చేసినట్లు లేదు- మొదటి నుంచీ దొరయే కౌలుచేస్తున్నాడని అనుకోవాల్సి వుంటుంది- రఘునాధాచార్యుల తండ్రి కాలంలో చెరువుకింద బంగారంలాంటి చెక్క ఉన్నట్లు, అది రఘునాధాచార్యుల కాలంవరకే, అంటే దొర ఇంట్లో పెండ్లికి పూర్వమే దొర స్వాధీనం అయిపోయినట్లు రఘునాధాచార్యులు భార్య ఆండాళమ్మ మాటల్లో నవల ఆరంభంలోనే అర్థమవుతుంది- అందుకే రఘునాధాచార్యులు వుండగానే ఆయన యాచకత్వానికి తిరిగి, ఆమె విస్తళ్ళు కుట్టి కుటుంబ పోషణ కష్టంగానే చేస్తుంటారు- ఈ అన్నింటినీ ఒక సమన్వయంతో ఆలోచించాల్సివస్తే ఇట్లా చెప్పవచ్చు:

చెరువుకింద నిక్షేపంలాంటి భూమి భుజంగరావు (రామభూపాల్‌రావు తండ్రి) ఇచ్చిన కాలంలో గానీ, 'మేమిచ్చిన భూమిమీద ఇకమీదట మీకేమీ బోక్యం వుండబోదు' అని పెళ్ళి తర్వాత దొర చెప్పినపుడుగానీ ఊహించవలసిన విషయమేమంటే ఎన్నడూ రఘునాధాచార్యుల కుటుంబం స్వంత వ్యవసాయం చేయలేదు- భుజంగరావో, రామభూపాల్‌రావో కౌలుకుచేసి ధాన్యమో, డబ్బో యిచ్చేవాళ్ళు- భుజంగరావు ఆచార వ్యవహారాలు, ధర్మనియమాలపట్ల గురివుండేది కనుక రఘునాధాచార్యుల తండ్రి కాలంలో 'నిక్షేపం'గా గడిచేది- రామభూపాల్‌రావు రఘునాధాచార్యుల పట్ల విముఖతవల్ల అవి మానేసాడు- కనుక అది ఎప్పుడూ దొరల, ఆచార్యుల మధ్యన వ్యవహారమే- ఇచ్చినా మానినా అది జనానికి తెలిసే అవకాశం తక్కువ.

ఇట్లా ఆలోచించడం పూర్తిగా సమంజసం అనలేము. ఎందుకంటే గ్రామాల్లో ఏ సమస్యా జనానికి తెలియకుండా జనం పట్టించుకోకుండ పోదు. ఆచార్య కుటుంబా

నికి భూమి వుందంటే, అది ఎవరు చేస్తున్నారు ఏమి ఇస్తున్నారు అనే విషయాలు జనం దృష్టికి రాకుండాపోవు. రఘునాథాచార్యుల ఆర్థికస్థితి దినదినము దిగజారడాన్ని బట్టయినా జనానికి అది తెలిసిరావాల్సింది. ఆచార్యత్వం పోయి విస్తళ్ళు కుట్టడము, వండిపెట్టడం, యాచకత్వం స్థితికి వాళ్ళు వచ్చారంటే ఇది జనం కళ్ళల్లో పడలేదన లేంగదా. అయితే కంఠీరవానికి ఈ వృత్తిపట్లవున్న అసహ్యంవంటిదే రచయితకు కూడ వుండడంవల్ల ఈ కుటుంబం భూమిని దొర తీసేసుకున్న దానికి ప్రజాప్రతిక్రియ చూపలేదనుకోవల్సివస్తుంది. ఆచార్యత్వం యాచకత్వమేనని, సోమరితనమని, కొమురయ్యలాంటి కష్టంచేసే జీవితమే జీవితమని కంఠీరవం అభిప్రాయం. ఆరంభంలో చెప్పినట్లు కంఠీరవం పాత్రలో రచయిత ఆత్మకథ వుందనే విషయాన్ని అంగీకరిస్తే ఈ విషయంలో రచయిత అభిప్రాయం కూడ అదేనని గ్రహించగలం. కొమురయ్య భూమి విషయం నవల మొత్తంలో అంత కీలక సమస్య కావడానికి కూడ ఈ దృష్టేకారణం. దీనిని అచ్చంగా దీనికి ప్రతిగా Contrasd గా ముందు వివరిస్తాను. అయితే ఆచార్య కుటుంబం భూమి విషయంలో రచయిత న్యాయం చేయ లేదనే నా ఆలోచనను ముందు వివరిస్తాను.

ఇచ్చింది దొర, తీసుకున్నది దొర అయినప్పటికీ ఆ భూమి దొరకు మాత్రం ఎక్కడినుంచి వచ్చింది? ఆచార్యత్వం పూర్తిగా కాపు కులస్థులలాంటి కష్టించే జీవితం కాకపోవచ్చు కాని, రఘునాథాచార్యుల ఆండాళమ్మ మాటల్లో వ్యక్తమయినట్లుగా వాళ్ళుచాకిరీ చేస్తున్నారు. విస్తళ్ళు కుడుతున్నారు, వండిపెడుతున్నారు. ఇది కాయకష్టమే. వృత్తుల వారికి భూమి హక్కు వున్నట్లుగానే కనీసం ఈ చాకిరీ చేసినందుకైనా వీళ్ళకు భూమి వుండాలి కదా. పైగా వీటికి ప్రతిఫలం లేదు. వెట్టి చాకిరీయే. ఆచార్యత్వం సోమరి జీవితమేననేది కేవలం యాచకత్వం వరకేనయితే సమిక్షించవచ్చు కాని కాయకష్టంచేస్తున్న దాఖల్ వున్నచోట సానుభూతి చూపాల్సిందే. ఇలాంటి పనులకు ప్రతిఫలం లేనపుడు వాళ్ళ బతుకుదెరువుకు మడో మాన్యమో వుండాలి కదా. లేదు వాళ్ళు పూర్తిగా ఆచార్యత్వం మాత్రమే నెరపుతున్నారు ఒక్క చెమట చుక్క కూడ కార్చడంలేదు అని అనుకుందాం- ఆ నేరం దొరకు వాళ్ళ భూమి మీద హక్కు ఇవ్వజాలరు కదా. అసలు దొర మాత్రం ఏ కష్టం చేస్తున్నడని ఇన్ని వందల ఎకరాల భూమికి హక్కుదారుడయ్యాడు. కొమురయ్య కౌలుకు చేస్తున్న భూమి కూడ ఇలాంటి ఒక బ్రాహ్మణ కుటుంబానిదే. అది దొర స్వాధీనం చేసుకుంటే ఎంత అందోళన, ప్రతి ఘటన ఆ గ్రామంలో వ్యక్తమయింది. కనుక ఆచార్య కుటుంబం భూమిని

దొర స్వాధీనం చేసుకోవడానికి రచయిత ప్రాధాన్యమివ్వక పోవడానికి కొమురయ్య కౌలు చేసే భూమికి అంత ప్రాధాన్యమివ్వడానికి రచయిత మనసు మీద ముద్ర వేసిన భావన- దున్నేవాడిదే భూమి అనే దృక్పథం. ఆచార్య కుటుంబం ఎన్నడూ ఆ భూమి దున్నలేదు గనుక రచయితకు వాళ్ళ భూమి పోతే కన్నీళ్ళు లేవు. అందుకే దిమ్మె గూడెం ప్రజలకు కూడ అది పట్టలేదు. అందుకే నవలలో ఎక్కడా కూడ బ్రాహ్మణ కుటుంబం భూమిని కోటయ్య (కొమురయ్య తండ్రి) భూమిగానే (ఆ కుటుంబం కౌలుకు చేస్తున్నది గనుక) ప్రజలయినా, రచయిత అయినా పరిగణిస్తారు తప్ప బ్రాహ్మణ కుటుంబం భూమిగా పరిగణించరు. తన స్వార్థం కొద్దీ దొర ఒక్కడే ఆ తిరకాసు పెట్టి ఆ భూమిని స్వాధీనం చేసుకొంటాడు. తెలంగాణలో 1949 తర్వాత తలపెట్టక తప్పని భూసంస్కరణలకు ప్రజల్లో కౌల్దారీ విధానం గురించి వున్న ఈ చైతన్యమూ, దృక్పథమే కారణం. ఈ చైతన్యం ఉజ్వలమైన రైతాంగ పోరాటాలతో 46 నాటికి మరింత పదునెక్కింది. ఇరవై ఎకరాల తోట భూమి వెంకటేశ్వర్లుది కొమురయ్య సేద్యం చేసాడు. ఆయన తండ్రి కోటయ్య చేసాడు. అందుకే అది వెంకటేశ్వర్లుదిగా స్థాపించబడిన తర్వాత కొమురయ్యకే ఇచ్చి వేసాడు. కొమురయ్య స్వంతమై పోయింది. పది సంవత్సరాలకు పైన రైతు వరుసగా కౌలుకు చేస్తే, ఆ భూమి రైతు స్వంతం అవుతుందనే చట్టానికి ఈ ఆలోచన బలవత్తరమైన ప్రేరణ అందుకే అన్నమ్మ అడ్డగించిననాడు గానీ, కొమురయ్య ప్రశ్నించిననాడు గానీ, నవల ఆసాంతము భూమి సమస్య వచ్చినపుడల్లా ఈ భూమి సమస్య ప్రస్తావనకు వచ్చినపుడల్లా వాళ్ళు ఎంతో ఆత్మ విశ్వాసంతో అది తమ భూమి అన్నట్లే మాట్లాడుతారు. వాళ్ళే కాదు, ప్రజలు కూడ అట్లాగే భావిస్తారు- మరి అందరికీ తెలుసు, అది బ్రాహ్మణ కుటుంబం భూమి అని. దున్నే వానిదే భూమి అనే భావన తెలంగాణ రైతాంగంలో అంతర్లీనమైనది. అది ఒక దశలో అణగారి వుండవచ్చు. ఒక దశలో వ్యక్తం కావచ్చు. కాని అది వాళ్ళకు సహజమైన, రక్తమాంసాల్లో ఇంకి పోయిన ఆలోచన. కౌలుదారు అది తన భూమి అని యజమానిగ భావించక పోవచ్చు. కాని తానే ఎప్పుడూ కౌలు చేస్తానని, అట్లా కౌలు చేయడం తన హక్కని భావిస్తాడు. అందుకే కోటయ్య కాలం నుంచి కొమురయ్య కాలం దాక ముప్పది సంవత్సరాలు కౌలు చేసారు. అది దొర కాదు కదా, ఆ బ్రాహ్మడే వచ్చి మారుస్తానన్నా వాళ్ళు ఒప్పుకోరు- కౌలు కట్టక పోతేనో, సేద్యం చేయకపోతేనో ఇంకొకరికి ఇవ్వవలసిందే తప్ప ఇంకొకరికి కౌలుకిచ్చే హక్కు యజమానికి మాత్రమెక్కడిది అనేంత అమాయకత్వం వాళ్ళది- ఈ అమాయకత్వంలో పట్టుదల వుంది- భూమిమీద విశ్వాసము, ప్రేమ అన్నిటికన్న

బలీయమైంది- భూమి వాళ్ళ రక్త, మాంసాల్లో ఊపిరిలో భాగం- ఎవరి భూమి అని కాదు. అది తమ రెక్కలకింద చందనంగా, బంగారంగా తీర్చిదిద్దుతారు- కోటయ్య, కొమురయ్యలు బ్రాహ్మణ కుటుంబం భూమిని అట్లా చేసే తోటభూమిగా మార్చారు- పట్టా ఎవరిపేరుమీద వుంటే వాళ్ళకు భూమి పాలు యివ్వడానికి, కౌలు యివ్వడానికి వాళ్ళు వ్యతిరేకించలేదు- ఆ భూమి నుంచి వైదొలగి, ఇంక దానితో అనుబంధం తెంచుకోవాలన్నపుడే తీవ్రమయిన అసంతృప్తి, ఆవేదన, ప్రతిఘటన- ఈ చైతన్యం అసలు ఈ భూమి ఎవరిది, ఎవరికి, ఎప్పుడు ఎట్లా వచ్చిందన్న మూల ప్రశ్నలకు దారితీసింది.

కొమురయ్య కౌలుకు చేస్తున్న భూమి దొర స్వాధీనం చేసుకున్నప్పుడు అది కొమురయ్యకే చెందాలని జాగృతమైన చైతన్యం గ్రామంలోని చెరువు లోతట్టు ప్రాంతంలో కుమ్మరి కుండలకోసం మట్టి తీసుకుంటే సుంకరోడు అడ్డగిస్తే అసలు చెరువు ఎవ్వరిది, చింత లెవ్వరివి- అనే ప్రశ్నకు దారితీసింది. చెరువు, చింతలు ప్రభుత్వానివి (ప్రజలవే అనే చైతన్యం ఇంకొక మెట్టు పైస్థాయి) కనుక అవి గుడుగుడుగుంచంగా ప్రతి సంవత్సరం జరగని హర్రాజు, జరిగినట్లుగ రాసి దొరపేర పాటపాడినట్లుగా అతనికిచ్చివేయడానికి వీల్లేదని, హర్రాజు పద్ధతి ప్రకారం దండోరా వేయించి, నోటీసు అంటించి గ్రామీయులకంతా తెలిపి జరపాలని పట్టుబట్టారు. ఆ హర్రాజులో తాము దొరతో పోటీ పడడానికి కూడ సిద్ధమయ్యారు- ఈ సమిష్టి పోరాటంలో వాళ్ళు విజయవంతమైవుంటే ఆ చెరువులో సమిష్టి వ్యవసాయం చేసే వాళ్ళేనేమో. అయితే 1938 కన్నా పూర్వం మనం అంత సమిష్టి స్వప్నాన్ని ఊహించలేము- నిశ్చయంగా రచయితకు ఆ స్వప్నం వుంది. విజయదేవు, పరంధామయ్య చంద్రయ్య, కొమురయ్యలకలాంటి సమిష్టి చైతన్యం వుంది- ఆ పోరాటంలో వాళ్ళు ప్రభుత్వం భూమి దొరభూమి కాజాలదని మాత్రం తేల్చివేయ గలిగారు. దొర అధికారాన్ని ప్రశ్నించగలిగారు- భూమిపై, ప్రైవేట్ ఆస్తిపైనే కాదు, ప్రభుత్వ ఆస్తిపై కూడ ఆనాటి వరకూ అడిగేవారు లేకుండా కొనసాగుతున్న పెత్తందార్ల హక్కును ప్రశ్నించారు.

అన్నమ్మ దొర అరకలను అడ్డగించి నపుడుగానీ, రైతులు చెరువులో దొర అరకలు విడిచేసినపుడుగానీ కంఠీరవం లేడు- వేరే మాటల్లో చెప్పాలంటే అప్పటిదాకా సాగిన భూమి పోరాటాల్లో కంఠీరవం ప్రత్యక్ష పాత్రలేదు- కంఠీరవం ప్రత్యక్షపాత్ర లేదనే ఎందుకంటున్నానంటే చెరువు పోరాటం నాటికి ఆగ్రామంపై కంఠీరవం ప్రభావం బలంగా వుంది- కంఠీరవం చైతన్యానికి ఆ గ్రామమెంత భూమికయో, ఆ గ్రామ ప్రజల చైతన్యానికి కంఠీరవం నాయకత్వం, కంఠీరవం నిజామాబాదు ప్రజాహిత

కార్యాల్లో నిర్వహించిన పాత్ర, ప్రత్యక్షంగా మత పరివర్తన కార్యాలయంలో ఆయన ప్రదర్శించిన సాహసము, ధైర్యమూ అంత ప్రేరణ- ఉద్దీపన. కొమురయ్య విజయ దేవుతో ఎన్నోమార్లు కంఠీరవం స్థయిర్యాన్ని, ధైర్యాన్ని, ప్రభుత్వ వ్యతిరేకతను గురించి చెప్పివున్నాడు.

అంతేకాకుండా చెరువులో దొర అరకలు విడిచేసిన పరంధామయ్య నిజామా బాదులో గ్రంథాలయోద్యమంలోనూ యితర ప్రజాహిత కార్యాల్లోనూ కంఠీరవంతో తర్ఫీదయి దిమ్మగూడెం కొమురయ్యతోపాటు వచ్చి గ్రంధాలయాన్ని రాత్రి పాఠశాలను నిర్వహిస్తున్నవాడు- గ్రామ సమస్యలతో కొమురయ్య సహవాసంతో ప్రజాచైతన్యాన్ని పొందినవాడు- విజయదేవ్‌కు కూడా సరియైన చైతన్యం కల్గడానికి దోహదం చేసిన వాడు- కనుక కొమురయ్య, పరంధామయ్యల నాయకత్వం కంఠీరవం శిక్షణలో రూపొందిందే.

అయితే యీ కంఠీరవం చైతన్యానికి నిజమైన పరీక్ష అతడు తన అన్నను నిర్బంధించడానికి రైతాంగమంతా ఉత్సాహం చూపినపుడు ముందుభాగాన నిలుస్తాడా లేదా అనేది. ఊరినుంచి వెళ్ళిపోయినపుడు తల్లి గురించి అన్నతో పోట్లాడి కొము రయ్య సాయంతో 'పారిపోయాడు'. ఇవ్వాళ ఊరికి తిరిగి వచ్చి నేలతల్లి సమస్యపై అన్నతో పోట్లాడడానికి 'నిలుస్తున్నాడు'. కొమురయ్యకు సాయంగా దొరకు వ్యతిరేక పోరాటంలో అన్నగాదు ఆత్మీయులుగాదు ఎవరినైనా ఎదుర్కొని నిలువడానికి సంసి ద్ధంగా వున్నాడు- ఇక్కడ నిస్సహాయుడు లేదు సమస్యల నుంచి పారిపోవడంలేదు. ఈ చైతన్యం కంఠీరవానికే కాదు యీ గ్రామ సమస్యలు అర్థమయిన వెంకటేశ్వర రావుకు కూడా కలిగింది- అందుకే యిద్దరూ దిమ్మగూడెంలోనే శాశ్వతంగాస్థిరపడ్డారు. కంఠీరవం కొమురయ్య వ్యవసాయంలో పాల్గొన్నాడు- నవల ఆరంభంలో ఏ కృషీవల జీవితాన్నైతే కోరుకున్నాడో నవల అంతానికి అది ఆచరణలో చేసి చూపాడు.

వెంకటేశ్వర్లు పాత యిల్లు బాగుచేయించి కామారెడ్డిలో వకీలుగా వస్తూ పోతూ వున్నాడు- ఆయన భూమి కొమురయ్యకు యిచ్చివేశాడు- అంటే సమిష్టి జీవనమూ దున్నేవానికే భూమి రచయిత ఆదర్శాలనేవి చాలా స్పష్టం- ఈ దృక్పథం మతాతీత మైనది- ఆర్యసమాజీయుడైన విజయదేవ్, ముస్లిమ్ అయిన బషీరు వాళ్ళతో కలసి జీవించారు- వీళ్ళందరూ నమ్ముకున్నది నేలతల్లిని, నేలతల్లే యీ దేశప్రజల చైతన్యా నికి భూమిక అనే అవగాహనను పదునుపెట్టే గ్రంథాలయాన్ని, రాత్రి పాఠశాలను ఈ విధంగా దిమ్మగూడెం గ్రామంలో భూమి సమస్యకు గ్రంధాలయమూ; రాత్రి పాఠ శాల సమస్యలకు సమన్వయాన్ని సాధించాడు రచయిత.

అయితే యీ గ్రామంలో దున్నేవానికి దక్కిన భూమి కంఠీరవం సాధించిన సమిష్టి జీవనం అనాటి తెలంగాణా వాతావరణంలో నిజాం నిరంకుశ పాలనలో నిలుస్తాయా ? ఫ్యూడల్ వ్యవస్థ యింకా మర్రి వూడల్లా పాతుకపోయివున్న తెలంగాణా గ్రామీణ జీవితంలో ఒక్క దిమ్మగూడెం కేటాగా బతుకగల్గుతుందా ? రామభూపాల్‌రావు జైల్లో పడ్డాడు. కాని ఆయన వ్యవసాయాన్ని ఆయన అల్లుడు కొండలరావు సాగిస్తున్నాడు. హైదరలీ పట్వారీగా వున్నాడు. వెంకటాద్రీ వున్నాడు. అంతేగాదు దొర స్వాధీనంలో నుంచి ఒక్క కొమురయ్య భూమి మాత్రమే తిరిగి సాధించుకున్నారు. తక్కినవన్నీ దొరల, పెత్తందార్ల అనుభవంలో మాత్రమే వున్నాయి. ఇవన్నీ తెలంగాణా మొత్తంగా ప్రజల సమస్యలు పరిష్కారం కావడంమీద ఆధారపడినవే తప్ప విడిగా దిమ్మగూడెం సమస్యలుగా మాత్రం పరిష్కారం కాజాలవు. ఈ విషయంలో రచయితక్కూడా భ్రమలు లేవు. ఆయన దృష్టిలో కూడా నిజాం రాష్ట్ర విముక్తం వున్నది. అందుకే నిజాంనిరంకుశ పాలనకు వ్యతిరేకంగా రాజకీయ పోరాటాన్ని నిర్వహించడానికి స్టేట్ కాంగ్రెస్ అవతరణను యీ నవలలో కథానాయకుడు హృదయపూర్వకంగా ఆహ్వానిస్తాడు. జాతీయోద్యమంలో భాగంగా నిజాం రాష్ట్రంలోకూడా నిజాం నిరంకుశఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా రాజకీయ పోరాటం నిర్వహించబడితే గాని యిక్కడి భూమి సమస్య పరిష్కరింపబడదు. అంటే భూమి, భుక్తి కొరకు నిర్వహింపబడే పోరాటం అనివార్యంగా రాజకీయంగా విముక్తి పోరాటంగా పరిణమించక తప్పదు. రచయితకీ అవగాహన వుంది. అందుకే స్టేట్ కాంగ్రెస్ ఏర్పడిన వార్త వినగానె దిమ్మగూడెంలో శాశ్వతంగా వుండాలని నిర్ణయించుకున్న కంఠీరవం, వెంకటేశ్వరరావు, బషీర్, విజయదేవ్, పరంధామయ్యలు ఒక దళంగా ఏర్పడి హైదాబాదుకు వెళ్ళి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. తెలంగాణా అంతటా దిమ్మగూడాలు తలఎత్తడం ఇప్పుడు వాళ్ళ కర్తవ్యం. అంతేకాకుండా దిమ్మగూడెం ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించే చైతన్యం గల చంద్రయ్య, కొమురయ్య లాంటి ప్రజా కార్యకర్తలు అక్కడి భూమి పోరాటాల్లో రాటుదేలారు. ఇప్పటికైతే యీ సంధి దశలో విజయమే ఓటమి అయింది. ఓటమి గర్భంలోనే విజయం వుండడం వైరుధ్యాల సూత్రం. రామభూపాల్‌రావు విడుదలై వచ్చాడు. ప్రజలపై అధికార్ల దౌర్జన్యానికి అండగా నిలిచాడు. వెంకటేశ్వరరావు యిల్లు పోలీసు నాకాగా మారింది. అంటే యికనుంచి భూస్వామ్యంతోనే కాదు దాని కొమ్ముగాస్తున్న ప్రభుత్వంతో యుద్ధానికి ప్రజలు పూనుకున్నారు. భూమి పోరాటం రాజకీయ పోరాటంగా మారే పరిణామదశలో యీ నవల ముగిసింది.

# ఘాటెక్కే గంధక ధూమం

బి. టి. రామానుజం

చలికాలం రాకముందే చలి మొదలయింది–

రాత్రి అనుకోకుండా వాన పడింది– ఉదయం అయేసరికి చల్లగా వుంది–

ఫాక్టరీలు తెల్లవారకుండానే నల్లపొగను వదుల్తున్నాయి– పైనుంచి కిందకు పడ్తున్న మంచు పొగతో కల్సిపోయి వికృతంగా తయారయింది.

అక్కడ కూర్చున్న గురవయ్యకి అరవయ్యేళ్ళు దాటి ఏడాదయింది–

ఏళ్ళ పైబడి అతని వెన్నెముక వంగిపోయింది– దానికితోడు పంచదార బస్తాల బరువు దాన్ని, దయలేకుండా ఇంకా ముందుకు వంచేసింది– ఇప్పుడు ఆ వెన్నెముక అంతులేని చలిని పుట్టించి, అతన్ని వొణికిస్తోంది– ఎముకలను చలి కొరికేస్తుంటే చలిని ఆకలి కరకర నమిలేస్తోంది– ఆకలిలో వేడి రాజుకుంటోంది.

భూతంలా వుంటుంది పెద్దబజారు–

ఆ బజారు ఎంతుందో గురవయ్యకి అక్కణ్ణుంచి కన్పించదు– అయితే గురవయ్యకి అందులో ప్రతి కొట్టూ ఎరుకే.

ఇవేళ పొద్దున్న అక్కడ గోలా, గందరగోళం లేదు.

అంటే అక్కణ్ణుంచే కదిలే సరుకులు అక్కడే వున్నాయన్నమాట।

కొన్ని రోజుల నుంచీ సరుకుల కదలిక కన్నా మనుషుల కదలిక ఎక్కువయింది.

"ఓరి భగమంతుడా, మా బతుకులే దొరికాయా బుగ్గిసెయ్యటానికి" అన్నాడతను ఆకాశంలోకి చూస్తూ.

ఆకాశంలో ఎక్కడో ఓ మేఘం చాటున ఏదో పక్షి కదుల్తోంది– కాసేపటికి అతనికి అదీ కన్పించలేదు– కాసేపటికి కళ్ళు మసక అయిపోయాయి– చేతుల్తో కళ్ళు నులుముకొని, "మాయదారి బతుకులో ప్రతీదీ బూటకమేనాయె– ఇంక మనిషేటి నిలుస్తాడు" అనుకొన్నాడు.

"ఇసాపట్నం"కి కొన్ని మైళ్ళ అవతలకి వెళ్ళిపోయాయి అతని కళ్ళు– ఆలోచనలు అతని పాతికేళ్ళ ఎనక్కు జరిగిపోయాయి.

"నీకేటుంది– ఆ బొక్క ముక్క తప్పిస్తే– ఏటందుల నీకు కడుపు నిండి పోద్దేటి?" పోతరాజు ఓ మాదిరి కంట్రాక్టరు– దేన్లో అని అడక్కపోతే, అన్నింటికీనూ, లేబర్ సప్లయ్‌కీ, ఇళ్ళకీ ఇంకా చాలా వాటికీ.

పోతరాజుతో పాటు ఉన్న మనిషెవరో గురవయ్యకి తెలీదు.

"అయితేటి సెయ్యమంటావ్ ?" అన్నాడు గురవయ్య

"ఈ బాబున్నాసావ్, కంపెనీ వోళ్ళు- ఇక్కడ ఫాక్టరీ పెడ్తన్నారు."

ఆ బాబు టిప్పుటాపుగా ఉన్నాడు- అతన్చేతిలో ఫైల్సు ఉన్నాయి- కూలింగ్ గ్లాసులున్నాయి ముఖానికి.

"బాబింజనీరు బాబా ?" అన్నాడు గురవయ్య.

"అయితేటి, కాపోతేనేటి- ఒరే గురవయ్యా చెప్పిందను- నీ పెళ్ళామా పోయింది- ఒంటిపక్షి గాడివి- ఎన్నేళ్ళురా నీకు ? బలంగా వున్నావు- పనైయ్య గలవు గట్టిగా-"

పోతరాజు మాటల్ని అవతల మనిషి ఆపి, పొదుపుగా కొద్ది మాటల్లో కథ జెప్పేశాడు.

"ఇక్కడ ఫాక్టరీ పెట్టబోతున్నాం- ఫాక్టరీ అంటే బోల్డు జాగా కావాలి- జాగా వున్నవాళ్ళకి కొనుక్కునేందుకు దాని డబ్బూ, కంపెనీలో పనీ ఇస్తాం- మంచి డబ్బు లొస్తాయి."

"ఏదో మట్టి పిసుక్కునే వాళ్ళం, మిల్లు పనులు మాకేటి చేతవుతాయి."

"పని మేం నేర్పుతాం- మీ జాగా అమ్మకం గురించి వచ్చాం" అన్నాడతను- గురవయ్యకి వున్న కొద్దిజాగా కంపెనీవాళ్ళు కొనుక్కున్నారు.

తర్వాత కొంతకాలంకి పెద్ది గోడ నాల్గు పక్కలా లేచింది.

గురవయ్య చాలామందితో కల్సి రాళ్ళు కొట్టాడు- తట్టలు మోసాడు- రాళ్ళ సిమెంటుతో అతికించటం కొద్ది కొద్దిగా నేర్చుకొన్నాడు- ఓ సంవత్సరం తర్వాత అక్కడ ఫాక్టరీ బిల్డింగు లేచింది- లారీల్లో ఏవో మిషన్లు వచ్చాయి- అవి చాల బరువుగానూ బండగానూ వున్నాయి- ఎంత బరువుగా వున్నా, "బాబోరె ఇంత మిషనెంత పన్జేస్తేదో !"

అని ఆశ్చర్యపోతో దాన్ని మోసారు వాళ్లంతా.

పెద్ద ఇంజనీరు బాబు అరుస్తూనే ఉన్నాడు. "వీళ్లంతా గాడిద వెధవలు- వీటన్నాళనం చెసొదుల్తారు" అని.

అఖరికి ఒక మిషను జారి ఒకడి కాలు వేళ్ల తెగనే తెగాయి.

ఎట్లా అయితేనేం అక్కడ ఫ్యాక్టరీ మొదలయింది-

గాలిలో పొగ వదిలింది అది- గురువయ్యకి ఫ్యాక్టరీ గొట్టంలో పొగ మాత్రం రోజు కంట బడుతూనే వుంది.

ఫాక్టరీ మొదలయిన మర్నాడు లోపల అడుగు పెట్టబోతే-

గేటు దగ్గిరే అడ్డాడు, జవానులా వున్నాడు- ఖాకీ బట్టల్లో ఖాకీ టోపీ పెట్టుకొని. "కిరీ- కౌన్ హై?" అంటూ

వాడి అరుపుకి హడలి పోయాడు.

తర్వాత తెల్సింది.

మిల్లు పనికి గురువయ్య పనికి రాడట- అంచేత పనొచ్చినోళ్లని టవున్నుంచి తెచ్చారని- కొంతమంది బూవులు అమ్మినోళ్లకి 'దయకొద్దీ' పని అందులో ఇచ్చారని.

"దగా బాబూ" అంటే

"నోర్మయ్యి- లంజి కొడకా" అని తిట్టాడు పోతరాజు. అతనిప్పుడు ఫాక్టరీకి కాజువల్ లేబర్ని సప్లయ్ చేస్తున్నాడు.

అప్పుడొచ్చేడాడు 'ఇశాకపట్నం'

"ఏటో పట్నం వెళ్తే బతుకు మారి పోద్దనుకొంటరందరూ. ఇక్కడంతా ఇసకే. " అనుకొన్నాడు చాలా మార్లు. 'ఏటయ్యా గురువయ్యా నీ ప్రెతాపం' అంటే "బజార్లో కూలి నాకొడుకునో కాదో కూడా తెలీని కొజ్జాగాడ్ని" అంటాడతను కోపంగా.

"ఒరే గురవయ్యా నీ పేరేంట్రా" అని కొట్టు ఓనరెవరయినా అడిగితే.

"అప్పలాస్జు బాబూ-" అనాలని- అతనికి తెలుసు.

"ఒరే అప్పలాస్జూ రేపట్నుంచీ నిన్ను సూరిగాణ్ణి కింద మారిస్తే ఎలా వుంటుందిరా?"

అప్పలాస్జయినా, సూరిగాడయినా, గురవయ్య అయినా పేరుఏదయినా పాతికేళ్ల నుంచీ అతనక్కడే ఉంటున్నాడు. రాంబాబుగారి కొట్టుకి ముందు రాత్రి వేళల్లో ఒక కుక్క పడుకొని వుంటుంది. రాంబాబుగారి కొట్టు అంటే కిళ్లీ కొట్టు కాదు. పెద్ద బజారులో మధ్యలో వుందది. కొట్లన్నీ ఇరుకు ఇరుకు సందుల్లో ఉన్నట్లుంటాయి. వాటిలో కొన్ని అఫీసులయితే కొన్ని సామాను గోదాములు.

రాంబాబుగారి కొట్టు ముందు పడుక్కొనే కుక్క అరవదు కరవదు. కుక్కలు ఎన్నేళ్లు బతుకుతాయో తెలీదుగానీ గురువయ్యకి ఈ కుక్క బతుకు పాతికేళ్ల నుంచీ తప్పటం లేదు.

రోజూ అయితే అక్కడ రాత్రిళ్లు కాపలా.

"బాబూ, నాకు బయం బాబూ. దొంగ నా కొళ్లకు కత్తులుంటాయి నేకాయలేను" అంటే.

"మిగతా అందరికీ కొమ్ములు మొల్చుకొచ్చాయేంటిరా? తొంగోటానికి జాగా ఇచ్చి తొంగోరా అంటే కథలు చెప్తావు."

తెల్లవారగానే బాబొచ్చే వేళకి కొట్టు తెరవాలి. తర్వాత కొట్టూ, బయటా వూడ్చి శుభ్రం చెయ్యాలి. బాబు టంచనుగా తొమ్మిదింటి కొచ్చేస్తాడు. రాత్రి పదయే దాకా కొట్లో దీపం వెలుగుతూనే వుంటుంది. కొట్టు పక్కనే గోడవునుంది. దాన్నిండా పప్పు బస్తాలూ, పంచదార బస్తాలూ, నెయ్యి డబ్బాలూ, నూనె డబ్బాలూనూ. రాంబాబు కూరగాయల వ్యాపారం చెయ్యడు. అతనికి లారీలున్నాయి.

ఒకోసారి డబ్బట్టుకెళ్ళి బాంకులో ఇచ్చిరావాలి. ఇంకా ఏవో చెక్కులు కూడా ఇచ్చి బాంకుల్లో ఇచ్చిరమ్మంటారు.

అసలు పని ఇంకా వుంది.

లారీలూ, టెంపోలూ, లాగుడు బళ్లూ అయితే బజారులోపలకు రావు. కొన్ని పెద్ద షాపులకయితే అవి రావటానికి వీలుంది. మిగతా వాళ్ల బస్తాలు మోసుకొని వెళ్లాలి

"బాబోరే, ఇవి మనుషులు మొయ్యాల్సిన బరువు కాదురా చిట్టీ. ఇందుల ఎంత బరువుంటుందంటావ్."

"ఉండదంటావా? వందకిలోలు–"

"బాబోరేయ్, మరి గవర్నమెంటు వోళ్ళెందుకురా చూస్తుంటారు– మనం చచ్చిపోంరా?"

చిట్టి ఎందుకో వికృతంగా నవ్వాడు.

"తాతా, ఎందుకు బాధ పడతవ్‌లే– గుటుక్కున పెద్దరోడ్డులో పేణంవొదిలెయ్"

చిట్టి నల్లగా పొడవుగా వుంటాడు– అతనిలో నెమ్మదిగా మాట్లాడే గుణం కన్పించదు– అతనే ఇంకా అన్నాడు:

"పూర్వపు రోజుల్లో తాతా, బానిసలుండేవారుట లే. అంటే వాళ్ళు పశూలన్న మాట– ఎండనక వాననక గాడిదల్లా బరూలు మోసేవారు– పోతుల్లా బళ్ళులాగేవారు– మేనాల్లో మనుషుల్ని మోసేవారు– వాళ్ళందరికీ మనం ఇప్పుడు బిరూలేని వారసులం– ఎరికా?"

ఇట్లాంటి తిరుగులేని వారసులు 10 వేల మంది ఉన్నారు.

దుమ్ము- దుమ్ము.

గాలంతా దుమ్ము దుమ్ముగా వుంది.

గాలిలో చెలరేగుతున్న దుమ్ము మనిషిని కాల్చింతర్వాత ధూళిలా వికృతంగా వుంది.

గురవయ్య పొద్దున్న నుంచీ కదల్నేలేదు.

జనం- రొచ్చూ- మధ్యన బస్తాలూ, డబ్బాలూ వేసుకొని వేళ్లేటప్పుడు, అనుకునే వాడు- 'ఈ జనంలోనే చావాలి కాబోలు' అని.

ప్రళయంగా కన్పించే మనుషులంటే గురవయ్యకి భయం- ఒకోసారి వాళ్ళందరూ తనని తొక్కుకుంటూ వెళ్ళిపోతున్నట్లు వొణుకు పుట్టేది.

నిన్నటి సాయంత్రం

సంజెవేళ-

అంతంత మంది.

జనం, జనం- జనమే:

అంతమంది జనం గావుకేకలు వేసుకొంటూ పెద్ద వూరేగింపుగా వస్తుంటే అతనికి కళ్ళలో నీళ్ళు వచ్చాయి.

"టవున్లో ఎవళ్ళ కెవళ్ళంటారు గానీ, మనిషం తరువోత ఓళ్ళకొకళ్ళు అవకే పోతారా- ఈరోజు కాబోతే మరుకో రోజు."

గురవయ్యకి అరిచే ఓపికలేదు- ప్రతిరోజు బస్తాలూ, డబ్బాలూ మోసుకొంటూ ఇరుకు రోడ్లలో కదుల్తున్నాడు గానీ నిజాని కతనికి నడిచే వోపిక కూడా లేదు- పదడుగుల్నుంచీ కన్పిస్తుంటాయి అతని ఎముకలు- పొట్ట లోతుగా లోపలకు వెళ్ళిపోయుంది- అదీ చూట్టానికి చిన్నదిగా కుదించుకుపోయింది- మరంత చిన్న కడుపు నింపుకోటానికి ఈ గాడిద బతుకు బతకాల్సిన కర్మం ఎందుకుపడుతోందో గురవయ్యకి జన్మజన్మలకూ అర్థంకాని వేదాంతంలా వుండిపోయింది;

కాని,

బదుకులో అట్టే కదలికలేని అతని కిప్పుడో పెద్ద అలజడి కలుగుతోంది.

కడుపు కాలి కాలి, మసి అయిపోతుందా?

లేకపోతే గాడిద బతుకులు ఈడ్చే మనుషులు ముందుకాళ్ళతో ఏదైనా చేస్తారా?

గురవయ్య తలతిప్పి చూసాడు.

దూరంగా రోడ్డు మలుపు దగ్గిర ఆగిపోయి వున్నాయి.

లారీలూ, ట్రక్కులూ, లాగుడుబళ్ళూ అటూ ఇటూ రెండుపక్కలా రోడ్లచివర్న అవన్నీ అడ్డంగా వుండిపోయాయి- డ్రయివర్లు, క్లీనర్లూ సిగరెట్లూ బీడీల పొగ వదుల్తున్నారు- వాళ్ళు ఇక్కడికి రారు- ఆ ట్రక్కులూ లారీలూ కదలవు- ఇక్కడి బస్తాలూ డబ్బాలూ ఎంతకాలం నిద్రపోతాయో ఎవరికీ తెలీదు.

"లంజికొడుకులకు కొర్వు ముదిరినాది- నాకవోతే మనం మటుకు మనంసవ్వాల, ఆళ్ళు నవ్వులూ కూకుండాల."

గట్టిగా మాటలు విన్పిస్తే తలతిప్పి చూసాడు.

అప్పల్రాజు గుంపులో వస్తున్నాడు- ఓ పాతిక మంది- అందరూ నల్లగా వికారంగా వున్నారు- వాళ్ళకి ముప్పయ్యేళ్ళ పైన వుంటాయి.

"ఏటి తాతా, కాపేసీవేంటి? దొక్కులు ఎత్తుదామనే?" అన్నాడతను.

"నా కర్మంరా అప్పల్రాజూ-"

"నీ కర్మం కేంలే, తారాజువ్వంటుంది సూడలా- దాని దాబులా పైకెళ్ళి పోతూంది."

"ఏటో, ఆ పెద్దబాబులొచ్చి ఏటి సేస్తారో-"

ఇంకాసేపటికి అక్కడంతా గుంపులు గుంపులు జనం చేరిపోయారు.

పెద్ద వూరేగింపు- ఎర్రజెండాలూ, కేకలూ.

బజారు ముందుకువచ్చి ఆగిపోయారు,

పెద్ద దిమ్మముందు నిలబడి మాట్లాడాడు రంగసామి.

అప్పుడొచ్చాయి, కార్లు మూడు-

జనం అంతా గందరగోళంగా కోపంగా అరిచారు- కొందరు కార్లను గట్టిగా చేతుల్తో గుద్దారు.

కార్లోంచి దిగిన మనుషులు అతి కష్టంమీద జనాలను తోసుకొంటూ బజారు లోపలకు వెళ్ళారు.

* * *

లేబర్ సెక్రటరీ విసుగ్గా చూసాడు.

అక్కడ చేరిన వాళ్ళలో తన గురించి ఎక్కువగా ఎవరూ పట్టించుకొన్నట్లు అతనికి అన్పించలేదు- ముందున్న ఫైల్సు వెటకారం చేసినట్లు అన్పించింది.

లా-డిగ్రీ తీసుకొని పైకిపైకి వెళ్ళినట్లు అతనికి ఇంతకాలం తోచింది గానీ ఈ పోస్టులోకి వచ్చింతర్వాత పీకగా తయారయింది.

వందలూ, వేలూ వర్కర్లకీ-కంపెనీలకీ వచ్చే గొడవల్లో తలదూర్చటం అన్నంత బుద్ధి పొరపాటు పని వేరేవుండదని అతనికి పూర్తిగా అర్థం అవుతూనే వుంది కానీ, తప్పటంలేదు- ఎందుకంటే ఇదో పెద్ద ఇనపచట్రం. ఈ చట్రంలో రూల్సూ రెగ్యులేషన్లూ అన్నీ కలవాళ్ళకోసమే తయారయాయి- లేబర్ కి కలెక్టివ్ బేరం అంటూ ఓ ఆట తయారు చేసారు- బేరాలన్నీ ఆట కు డీ రూల్సు ప్రకారం ఆడాలి- దాంతో ఆట ఆడితే శకున్తో పాచికలు ఆట్టమే!

ఓ రకంగా అతనికి అమెరికా, బ్రిటన్ లు నయం అన్పిస్తుంది- బేరాల మధ్య మాట్లాడితే గవర్నమెంటు జోక్యం అంటూ వుండదు- 'మన భారత దేశంలో కార్మిక సంఘాలు ఇంకా బలం పుంజుకోలేదు- అప్పటిదాకా గవర్నమెంటు వాళ్ళకి మాట సాయం రావాలి' అని ఇతర్లు అన్నప్పుడల్లా అతనికి నవ్వొచ్చేది.

"ఇదో దగా, కంపెనీ వాళ్ళకి గవర్నమెంటు సాయం రావటం ఇది" అని అతను అనలేదు.

అక్కడ గదిలో చంద్రశేఖరం, ఇంకొంత మంది బజార్లో షాపులవాళ్ళున్నారు- రంగసామి పక్కన కొంతమంది యూనియన్ మనుషులున్నారు-

"మూర్తిగారు, అంటే లేబర్ సెక్రటరీ గారు ..." అంటూ చంద్రశేఖరం మొదలుపెట్టాడు.

ఆ తర్వాత వాళ్ళూ వీళ్ళూ చాలాసేపు అటూ, ఇటూ వాదించారు-

"ఇదో వింత గొడవ" అన్నాడు మూర్తి- "మీరు ఇండస్ట్రియల్ డిస్ప్యూట్ల లోకి రారు- అయినా మా కొంప ముంచుతున్నారు."

"ఇది తగువుకాదు, వీళ్ళకి గొంతెమ్మ కోర్కెలు" అన్నాడు చంద్రశేఖరం.

"ఇక్కడ నుంచి ఏపీ కదలవు మీ కర్మం" అన్నాడు రంగసామి.

నెలరోజుల్నుంచీ చిలికి చిలికి ఇవాళ గాలివానగా మారే సూచన-

పెద్ద బజారు అనబడే పెద్ద మార్కెట్ తెరిచే సూచనలు లేవు-

అంటే, లక్షలకొద్దీ ఆదాయం షాపుల వాళ్ళకీ, వేలకొద్ది కూలీలకు తిండి లాంటి పదార్థం దేశంలో చాలా మూలలకు సరుకులూ జీవసమాధిలో ఉంటాయి.

* * *

దాదాపు నెలరోజు లయింది–

చంద్రశేఖరంకి ఇష్టంవున్నా లేకపోయినా, అది అందరూ కల్సి నిర్ణయించారు. గొడవలు ఇలాగే వుంటే 'మా యాపారానికి పేడీ' అనీ, 'కూలి నా కొళ్ళే కొవ్వుదిగీ దాకా కొట్లు తెరవం గాక తెరవం– లంజికొళ్ళు మాడి సస్తరో, సముద్రిమందల పడి సస్తరో, ఏటి సేస్తారో సెయ్యండి' అనీను– 'అడిగీదానికి నేయం వుండాల– యాపారంగదా లచ్చలుంచి సావ్వా అని వాళ్ళోలోచన.'

పెద్దబజార్లొ కూలీ వెధవల ఆగడాలు మితిమీరి పోయాయని కొట్ల సంఘం పెద్దలు తీర్మానించారు– కొట్ల సంఘం అంటే కిళ్ళీకొట్ల సంఘం కాదు– టవునికి కొద్దిగా దూరంగా వుంటుంది పెద్దబజారు– అందులో ఐదొందలదాకా వున్నాయి కొట్లు.

పంచదార, బియ్యం, పప్పులూ ఉప్పులూ, ఉల్లిపాయలు, బంగాళా దుంపలూ, టామాటాలూ, నూనెలూ, నెయ్యిలూ.

మనిషి బతకటానికి రోజూ కావల్సిన తిండికి సంబంధించిన వస్తువులన్నీ టోకుగా అక్కడ్నుంచి వెళ్తాయి– దేశంలో ప్రజలు బీద వెధవలయితే కొనుక్కోడానికీ బోల్డు బయటదేశాలున్నాయి– వాటిని తీస్కెళ్ళటానికి సముద్రం నిండా పడవలున్నాయి– కొట్లసంఘం వీటన్నింటిని నడుపుతుంది. (అంటే పడవల్నికాదు. సరుకుల్ని) రోజూ ఎంతలేదన్నా ఓ ఎనభై లక్షల రూపాయలు గిర్రున తిరుగుతాయి. వాటితోపాటు– లారీలూ, ట్రక్కులూ, లాగుడుబళ్లూ, వాటిని తోలుతూ లాగుతూ మనిషి జన్మఎత్తిన శవాలూనూ, బస్తాలూ, డబ్బాలూ లారిల్లోంచి దింపటానికీ ఎత్తటానికీ ఓ పదివేలమంది కూలీలు.

వాళ్ళలో చాలమంది వాళ్ళ తాత ముత్తాతల దగ్గిర్నుంచీ ఈ బజార్లోనే బరువులు ఎత్తుతున్నారు.

అయ్యా! పనివాడంటే ఎవడు?

(పనిచేసే వాడే పనివాడు)

'వర్క్‌మెన్' అనగా వాడికి జీతం కరువు భత్యాలూ, శెలవలూ, జబ్బులొస్తే ఖర్చులూ ముసిలోడయితే తర్వాతా, వీటన్నిటికీ అండగా నిలకడగా పనీ ఉండాలి.

ఎంత మాట !

'కూలి వెధవలకు పెతిదీ ఇచ్చుకొంటూ కూర్చుంటే మా చేతికి చిప్ప వస్తుంది' అని కొట్ల సంఘం పెద్దలకు నిక్కచ్చిగా తెల్సు- అందుకే యాభై ఏళ్ళుగా పన్జేసే ముసిలాడికయినా వాళ్ళ కొట్లలో పన్జేసేవాడిగా గుర్తింపులేదు.

'ఆళ్ళ సొంత పను లాళ్ళు సేసుకొంటున్నారు- సామాను కొనేవాడు 'అబ్బీ కొద్దిగా సామాను లారీలో పడెయ్' అంటే పడేస్తున్నారు- వాళ్ళో పావలా ఇస్తున్నారు- మాకు సామానుతెస్తే ఏఁవో పావలా ఇస్తున్నాం- ఆళ్ళు మా పనోళ్ళెలా అవుతారు?'

గాంగుల్లో ఉండీ మనుషులు కూలీలు-

ఓ జట్టు.

నిజానికి ఏళ్ళకొద్దీ వాళ్ళు ఓ కొట్టుదగ్గిరే బరువులు ఎత్తుతూ ఉంటారు- పోర్టర్లు రైల్వే స్టేషనుల్లో ఉంటే, వీళ్ళు రోడ్లమీద ఉంటారు.

అంతేకాదు-

గురవయ్యవనీ అప్పలరాజువనీ చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి.

బజారుకు కొంచెం దూరంలో ఉన్నాయి బాంకులు- వారికి డబ్బూ, డబ్బుతో సమానం చెక్కులూ పట్టుకెళ్ళాలి.

గుర్ఖా అంటే ఓ ఖాకీ యూనిఫారం నెత్తిన ఓ టోపీ, తుపాకో కత్తో వుంటుంది. వాళ్ళు కాపలాదార్లు అయితే గురవయ్యలూ, అప్పలరాజులూ కాపలా కుక్కలు.

రాత్రయితే-

ఊరులో భయం ఉన్నా లేకపోయినా, ఖరీదయిన సరుకులుంటే ప్రమాదమే.

- నాలుగేళ్ళ క్రితం కాబోలు సిపంచలం చచ్చిపోయాడు- చచ్చిపొయ్యాడంటే పేదవాడికి గుండెపోటు లాంటి ఖరీదయిన జబ్బురాలేదు- సిపంచలంకి ఇరవైఅరేళ్ళే. అతనూ ఇలానే కాపలా కుక్కగా వుంటే, కుక్కలంటే పడనిదీ గాంగొచ్చి పడింది- వాళ్ళ చేతుల్లో చిన్నచిన్న తుపాకులు కూడా వున్నాయి.

గోడవునల్లో సామానులు తీసికెళ్ళాలంటే (అక్రమంగా)-

(సొమ్ములున్న బాబులు ఎర్రి వెధవలు కాదు)

కొంత దెబ్బలాట తప్పదు- అట్లాంటి గొడవల్లో సిపంచలం చచ్చిపొయ్యాడు- బాబుగారి సొమ్ము మిగిలిందా, లేక దొబ్బుకు పోయాదా అంటే తుపాకుల గుండాలు మహరాజుల్లా పట్టుకుపొయ్యారు.

ఇండస్ట్రియల్ డిస్ప్యూటు యాక్టులూ— కాంపెన్సేషన్ (వర్క్‌మన్‌లకి) యాక్టులూ ఉన్నవి అనామకుల కోసం కాదు. సివంచలం వర్కరు అంటానికి దాఖలాలు ఎక్కడా లేవు— ఒకవేళ ఉన్నా అతనికి 'నా' 'నీ' అన్నవాళ్ళు లేరు.

ఒకవేళ ఉంటే— వాళ్ళు ఏడుస్తూ కూర్చోటానికి వీలు అవ్వటంలేదు. ఎందుకంటే—
— మళ్ళీ తెల్లవారగానే

గోడవునులు తెరవాలి— నేల చిమ్మాలి— దుమ్ము తుడవాలి ఆఫీసు టేబుళ్ళమీద. మళ్ళీ పది దాటింతర్వాత బాంకులకు వెళ్ళాల్సి వస్తుంది.

ఈలోగా ఎండ పెరుగుతుంది.

బజారు నుంచి హార్బరుకీ, రైల్వే బోగిలుండే యార్డులకీ ఇంకా చాల మంది యాపారం చేసుకొనే వారి గోడవున్లకీ గొప్ప గొప్ప రహదార్లు లేకపోయినా, బురద రోడ్లూ— అక్కడక్కడా కంకర— తారు ఉన్నవీ ఉన్నాయి. చిన్న చిన్న సరుకులకి (అంటే) నాలుగయిదు బస్తాలూ డొక్కులూ మోసుకెళ్ళటానికి లారీలు, ట్రక్కులూ గిట్టుబాటు కావన్నది ఎవరికయినా తెలుస్తుంది— ఆ రోడ్లనిండా లాగుడు బళ్ళూ, కార్లూ, రిక్షాలూ, ట్రక్కులూ అన్నీ వెళ్తానే ఉంటాయి— వెళ్ళలేనిది మనుషులు మాత్రమే.

వీటన్నింటి మధ్య సత్తువలేని గాడిదలు కొన్ని మనిషిరూపం వేసుకొని వెళ్తా వుంటాయి— వాటితో వాతావరణం అంతా పాడయిపోతున్నట్లు కొందరు మర్యాదస్తులు నిత్యం అనుకొంటూనే ఉంటారు

— నాలుగేళ్ళ క్రితమే పైడికొండ చచ్చిపోయాడు.

ఆరోజు వానపడింది— వూరంతా బురదయి పోయింది— రోడ్లన్నీ సగం నీటి పాలయ్యాయి.

పైడికొండ నీళ్ళల్లోనూ, బురదలోనూ యీడ్చుకొంటూ నడుస్తూ ఉంటే, అతని మోకాలి చిప్పలు కనపడటం లేదు— అతని వీపునుంచీ పైభాగం ఎప్పుడూ కనబడదు— దానిమీద ఎప్పుడూ ఓ పెద్ద పంచదార బస్తా వుంటుంది— పంచదార తియ్యగానే ఉంటుంది— అయితే పైడికొండలాంటి వాళ్ళు ప్రాణంమీద తీపి ఎప్పుడో వదిలేసుకొనే ఉంటారు— మహానగరాల్లో మనుషులు పురుగుల్లా బతుకుతుంటారు— పురుగులు ఎప్పుడో ఎవరి కాలికిందో నలిగిపోతాయి— పంచదార బస్తా నూరు కిలోల బరువూ భూమి ఆకర్షణకి దగ్గిరవుదామని తీవ్రప్రయత్నం చేస్తుంటే, పైడికొండ వళ్ళంతా అటు భూమినీ, ఇటు వీపుమీదున్న తీపి మూటనీ కూడా ఎదిరించాలని విఫల ప్రయత్నం చేస్తోంది.

ఘూమే గెల్చింది– ఘూతల్లికి ఎన్నో అందలు.

బురదా, ఎదురుగా వస్తున్న లారీ, అక్కడే ఉన్న గొయ్యా, అది కనబడకుండా నీళ్ళూ– రంగు నీళ్ళలో కాలుజారిన పైడికొండకు లారీ క్రింద తన రక్తం పారుతుందని తెలీలేదు.

ప్రపంచంలో ఎవరికయినా 'క్వింటాలు బరువు' మనిషి మొయ్యాల్సిన బరువు కాదని తెలుస్తుంది– నాగరికత అంటూ ఉన్నచోట్ల అక్కడి సభ్యులకి అట్లాంటి నరకం ఉండకూడదనీ తెలుస్తుంది– కానయితే వారు సభ్యులా అని ఇతర్లు ప్రశ్నించవచ్చు– ప్రశ్నించారు.

అందుకే పైడికొండ చచ్చిపోయాడు.

పైడికొండడే కాకుండా ఇంకా ఇరవైమంది బస్తాల బరువుక్రింద చచ్చిపోయారు.

"బరువులు నిర్ణయించటం మా చేతుల్లోలేవు మేం ఏంచేస్తాం ?" బజారుపెద్దలు.

"కనీసం మనుషులచేత వాటిని మోయించటం మానొచ్చుగా ?"– అనామకులు.

"సరే, ఇంక వాళ్ళు బతుకు కూడు కూడా లేక చస్తారని !" బజారుపెద్దల దయ;

నాలుగేళ్ళ నుంచీ ఈ గొడవలు ఇలా వుంటూనే ఉన్నాయి.

*　　　*　　　*

పదేళ్ళ క్రితం వచ్చేసింది నీలమ్మ–

నీలమ్మ అంతకు ముందు పట్నం చూళ్ళేదు– పల్లెటూర్లో ఉంది– చిట్టితో పెళ్ళవగానే బస్తీకి వచ్చేసింది– బస్తీ అంటే పెద్ద పట్నం అనుకొనేది నీలమ్మ– అక్కడ సముద్రమూ, రంగురంగుల మనుషులూ, ఎత్తు ఎత్తు ఇళ్ళూ, ఎన్నో రకాల తినే వస్తువులూ ఉంటాయని కలల్లో కాకపోయినా పగలే అనుకొనేది.

బస్తీ అంటే గుడిసెల గుంపని అప్పుడే తెల్సింది నీలమ్మకి.

చాలాకాలం వరకూ ఈ బస్తీ బతుకు అర్థంకాలేదు నీలమ్మకి– మొదట్లో పుష్టిగానే వుండేది ఆరోగ్యం.

చిట్టి మాట పెళుసు– 'మనసు మంచిదే' అంటుంది నీలమ్మ. బజార్లో 'కూలీ పనా ?' అనుకొంది– కొద్దిగా బాధ పడింది.

'చిట్టిగాడికేం బోనసూ వస్తుంది' అన్నారు పక్కల్నుండే వాళ్ళు– బోనసంటే ఏమిటో నీలమ్మకి తెలియదు– పక్కల్నుండే గుడిసెల్లో ఆడవాళ్ళు తక్కువమంది– అక్కడ ఐదారొందలు గుడిసెలు కొద్దిగా పల్లంలోకి ఉన్నాయి– నీలమ్మ ఉండే గుడిసె

మరీ పెద్దది కాకపోయినా గౌరమ్మా, చిన్నల్లీ, నూకాలూ వాళ్ళ మొగుళ్ళూ కూడా అందులోనే ఉంటారు- వాళ్ళెవరూ చిట్టికి బంధువులూ కారు.

కొత్తలో, 'ఇంత మందిలో తొంగోటం ఎలా?' అనుకొంది- ఆ తర్వాత కొందరు గుడిసెబయటా, కొందరు లోపలా, అడ్డంగా ఆరేసిన గుడ్డలూ- అలవాటయిపోయింది నీలమ్మకి- ఇప్పుడు నీలమ్మకి ఆరేళ్ళ గుంటడూ, ఏడాది పిల్లాసూ- ఆ పిల్ల ఇప్పటికీ పాలకోసం నీలమ్మని ఏడిపిస్తూనే ఉంటుంది.

"ఏటుంటుందే ముదనష్టపు ముండా"- అని తిడ్తూంటుంది.

తిట్టినా తిట్టకపోయినా వచ్చే ఒక్కబొట్టయినా పసికూన తాగకపోతే నీలమ్మకి రక్తంలాగేసి గుండెలు పీకేసినట్లు నొప్పివస్తుంది.

రాత్రయితే, పొయ్యి, గుడిసె బయట. అందరుపొయ్యిలూ చీకట్లో పొగకన్పించక పోయినా దగ్గూకళ్లమంటా. వండేది ఎక్కువలేకపోయినా- పదిమందికి ఓకుండచాలక పోయినా వంతులవారిగా,

పగలయితే

రాళ్లకొట్టటం. సున్నంకలపటం. నీలమ్మ కాళ్లపొక్కటంకూడా మానేసాయి. ఇరవై ముప్పై గుడిసెలమధ్య ఉంటే ఒకచిన్న పంపుంటుంది. దాంట్లో నీళ్ళకోసం కొట్లాటలు.

వానొస్తే- గుడిసెలన్నీ నీటిమయమే. ఇంకాగుడిసెలకి ఓచివరగావెళ్తే నాసిరకంబియ్యం, పనికిరాని కూరలూవేసుకొని అమ్మతుంటారు గుడిసెల్లోవాళ్లే. వాళ్ళకే. (స్వయంసమృద్ధి)

ఇటుపక్కగా కాలవో, చెరువో తెలీని నీళ్ళగొయ్యి- పదిగుడిసెలపాటి. దాన్లోనే మనుషులు స్నానంచేస్తుంటారు. బట్టలు ఉతుకుతుంటారు. ఈత వచ్చినవాళ్ళు ఈదుతూ చివరిదాకా పోతుంటారు. తిండితినే పళ్ళేలూ, వండేగిన్నెలూ అందులోనే కడుగుతుంటారు.

పదిహేను ఇరవైగుడిసెలకి ఒకటుంటుంది- ఓఇటికల షెడ్డులాంటిది. అది వాళ్ళకి మరుగుస్థలం. కూర్చునేపలక- దానికిఓకన్నం- క్రింద ఓపెద్ద తొట్టిలాంటిది. మామూలుగా అయితే కార్పొరేషన్ వాళ్లోఎవళ్ళో ఊడ్చేవాళ్ళువచ్చి రెండురోజులకొసారి దాన్నిశుభ్రంచెయ్యాలి- ఈమధ్య అలాంటివి జరగటంమానేసి చాలా ఏళ్ళయింది ఒకోసారి వారాలు గడిచిపోతుంటాయి.

ఈలోగా నేలంతా మరుగుమయం.

వాటిమీద ఈగలూ౼ దోమలూ.

జుగుప్స ఒక్కటేఅయితే బాధపడాల్సింది అట్టేలేదు౼ కలరా, మశూచీ౼ క్షయా ఇంకా జీర్ణవాయువులకు సంబంధించిన చాలాజబ్బులూ ప్రారంభం అవుతుంటాయి.

బస్తీలో ఇట్లాంటివాటితో ఎంత మందిచచ్చిపోయారో వాళ్ళకేతెలీదు౼ దూరంగా ఫాక్టరీలపొగా, దుమ్మూ౼ కలుషితం అంతా మనుషుల్ని జబ్బులకు బానిసలుగా చేస్తుంటాయి.

ఊపిరితిత్తుల్లో క్షయపెట్టుకొని ఎంతోమంది బరువులు మోస్తూనేఉన్నారు౼ బరువులకింద కూలుతూనే ఉన్నారు.

బిజినెస్ అట్టేలేనిరోజుల్లో౼

బజారులో గోడవునుముందే౼

గూనప్పారావుకీవుంది క్షయ౼ అతనుమనిషి సలభయ్యేగానీ అరవైలావుంటాడు; సన్నగా ఎముకలుపోగులా, బస్తాలతొందరమీద మనిషి పొరపాటుగా బస్తాఎత్తుకొన్న అప్పారావుమీద ఇంకోబస్తాపెట్టేశాడు౼ అప్పారావుమెడ విరిగిపోయి చచ్చిపోయాడు.

దాంతోగొడవ మొదలయింది.

పీనుగుల్లా వున్నవాళ్ళందరూ పనికిరారనీ అదీకాక యాపారం పనీలేదు కాబట్టి మనుషులు అక్కర్లేదనీ మూడువందల మందిని పొమ్మన్నారు.

ఎప్పట్నుంచో అడుగుతున్నారు౼

సంవత్సరాని కోసారి పేన్నీళ్ళకు చన్నీళ్ళుగా ఉంటాయని కొద్దిపాటుడబ్బు బోనస్ఇవ్వాలని౼ (పర్మనెంటు వాళ్ళకితప్పిస్తే మిగతావాళ్ళకి ఇట్లాంటివిఉండవు౼ కొద్ది మందికిచ్చారు౼ మిగతావాళ్ల మొండికేశారు.)

దాంతో చిలికిచిలికి గాలివానయింది.

దాదాపు ఓవెయ్యిమందిఉన్న యూనియన్ బోనస్గురించీ, తీసేసిన వాళ్ళ గురించీ బరువులగురించీ అల్లరిచేస్తే౼

ఈగోల మేంభరింలేం౼ అన్నారు పెద్దబజారుటనర్లు.

అనటంకాదు౼ గోడవుస్లూ, కొట్లూ మూసేసారు.

దాంతోఅకలీ కరువూమొదలు.

*　　*　　*

దీపావళి.

పూర్లోని పెద్దపెద్దమేడలూ, భవంతులూ అమావాస్యచీకట్లో మెరుస్తున్నాయి.

బస్తీలోంచిచూస్తే తారాజువ్వలూ అవీఆకాశంలో కన్పించి క్రిందపడి గుడిసెల్ని కాల్చేస్తాయోమోనన్నట్లున్నాయి.

మామూలుగా చీకట్లో వంటపొయ్యిలమంటే వెలుగ్గా వుండేది- ఇప్పుడుఅదీలేదు.

మనుషులకి చీకట్లో కళ్లమంటలుగా అన్పించాయి.

పండగకోసం కాకపోయినా వాళ్ళకి గుండెమండింది.

*　　　*　　　*

రామారావుకి బుర్రంతా పిచ్చెక్కినట్లుంది-

వచ్చే జీతం సొమ్ములు నెలకి సరిగ్గా చాలి చావటం లేదు- దానికితోడు నెల రోజుల్నుంచీ పూర్లో అన్ని రేట్లు పెరిగిపోయాయి.

"మమ్మల్ని చంపుకు తినటం ఎందుకు- మూటలు కట్టుకొని ఉన్నాం అనా?" అనడిగితే-

"వాళ్ళను (పెద్దబజారు వాళ్ళని) అడక్కూడదూ? కొట్లన్ని మూసుక్కూర్చుంటే మాకు ఎక్కణ్నుంచి వస్తాయి మాష్టారూ?" అన్నాడు కొట్టువాడు.

ఈ గొడవలోనే పెళ్ళి తంతొకటి.

తమ్ముడి పెళ్ళి ఇంత అనవసరమయిన తంటా అవుతుందని అతనెన్నడూ అనుకోలేదు- నానా బాధలూపడీ పక్క పూర్నించి, సొంతూరునుంచీ కొన్ని తెప్పించాడు.

ఇప్పుడు కొంప మునిగిపోయినంత పనయింది- ఉన్న నెయ్యి అంతా అయిపోయింది- 'ఖర్మ!' అనుకొన్నాడతను.

పనికట్టుకోని వెళ్ళి కొట్టువాడి పీకలమీద కూర్చున్నాడు.

"లాభంలేదు మాష్టారూ! మేం ఏంచేస్తాం చెప్పండి."

"ఏదో ఒకటి చెయ్యవయ్యా బాబూ, పోనీ ఎక్కడన్నా పొరపాటున దొరుకుతుందేమో చెప్పు- నేనే తెచ్చుకొంటాను."

"అదీ నమ్మకంలేదు- రిస్కనుకోండి- తిన్నగా బజారుకే వెళ్ళకూడదూ? వాళ్ళ మూటలు మొయ్యటం లేదనుకొండి- మీరంతట మీరే కొనుక్కొంటే వాళ్ళ ఇస్తారేమో చూడండి.

అదే చేసాడు రామారావు.

అతనింటికి ఐదు మైళ్ళ దూరంలో వుంది బజారు- అతనక్కడికి వెళ్ళేసరికి అక్కడంతా గోలగోలగా వుంది- ఆఖరికి ఓ చిన్న గోడవున్లో సంపాదించాడు రెండు డబ్బాలు నెయ్యి- "పీడ వదిలింది" అనుకొంటూ బయట అడుగు పెట్టాడతను.

*　　　*　　　*

"గురూగారు దంచేసారు" అన్నాడు అప్పారావు- "మీటింగులో వాళ్ళంతా దంగయి పోతేనూ...." రంగసామి పొంగాడు.

అతను తాగేసిన టీ కప్పు టేబులుమీద పెడుతూ, "కానేటి లాబం ? మీటింగు గుడ్డు గుడిసి పోయింది గదా, కొట్లు మూసుకూర్చుంటే యీళ్ళంత మా సంకలు నాకాల్న" అన్నాడు

"ఏటి గురూగారు అంతమాటనేస్తే వొల్లగాదు- రంగసామిగారున్నారంటే తేల్చీవాలి యిషయం- ఏటెన్నిమార్లు రేట్లుపెంచారు? ఏటి, ఇంతకుముందిలాగే సొమ్ము లేవోఅని ఏడ్చేసిన నాయాళ్ళంతా యాడాదికోపాలి మూడుసార్లు అందరికీ వందవంద కక్కలేదూ?" అన్నాడు అప్పారావు.

గదిలో ఇంకాచాలా మందున్నారు.

బజారులోనే ఓచిన్నరూము యూనియన్‌కి తీసుకున్నారు- అందులో కూర్చుం టాడు రంగసామి- యూనియన్‌కి అతను ప్రెసిడెంటు- ఇంకా చాలమంది ఉన్నారు గానీ రాంగసామిచెప్పింది వాళ్ళకువేదం.

యూనియన్‌లో ఉన్నది వెయ్యికి కొంచెంమంది ఎక్కువగా అరవయ్యో డెబ్భయ్యోను- కాకపోతే మిగతా వాళ్ళందరూకూడా యూనియన్ చెప్పినట్లేవింటారు- ఎందుకంటే అక్కడ జరిగేవన్నీ యూనియన్‌కి పెద్దబజారు ఓనర్లకీమధ్య ఒప్పందాలవల్లే జరుగుతాయి.

రంగసామి పైజమా, లాల్చీ వేసుకొనిఉన్నాడు. అతనికి నలభై ఐదేళ్లుంటాయి. మనిషి ఆరోగ్యంగా ఉంటాడు- చేతిలో ఎప్పుడూ సిగరెట్టు వెలుగుతూనే ఉంటుంది.

"రంగసామి గాడికి కలేజా వుంది" అని బజారు ఓనర్లు అప్పుడప్పుడూ అంటుంటారు.

"నా జోలికొచ్చి యాసికాలేస్తే, నా దమ్ములేటో తెల్సిపోతుంది" అన్నాడు రంగసామి- "కొట్లు మూసేసుకొని కూర్చుంటే మెదవలు తిండిలేక సస్తారని ప్లాను

గాబోల్ను- కొట్లు ఇరగదీసి ఉన్నకాడికి దొబ్బుకెళ్తే సరి" అన్నాడు- ఆ పని జరిగేది కాదని అతనికీ తెల్సు- కాకపోతే అలాగ మాట్లాడకపోతే జనాలు వెనక ఉండరని.

"అయితే ఏటి సేస్తారు? కొట్లన్ని తెరవం గాక తెరవం అన్నారాళ్ళు- మనం ఏంజేస్తే ఏటవుతుంది?" అన్నాడు చిట్టి. అతని పక్కనే అప్పల్రాజున్నాడు- ఇంకా చిట్టితో ఉండేవాళ్ళు ముగ్గురు నలుగురున్నారు- గదిలో అంతా కల్సి ఓ పదిహేను మందిదాకా ఉన్నారు.

"దానికేటయినా ఆలోసించాల- అయినా ఇదన్యాయం- ఓ పక్క రేట్లు మంట లల్లే అంటుకుపోతుంటే, మనుషులు తినేవన్ని తాళమేసి దాచీటం మజాకా కాదు- అదేంటి- దీని గొడవ నిమిషంలో కుదిరిపోతుంది- దీని బాబులాంటి గొడవలున్నాయి మనకి- అవి తేల్చుసుకొంటే, నాకు సగం బారం తగ్గిపోద్ది" అన్నాడు రంగసామి.

రంగసామి కంత మొయ్యలేని భారాలు ఏం వున్నాయో అక్కడున్న మిగతా వాళ్ళకి తెలియలేదు- రంగసామే అన్నాడు;

"ఇప్పుడిషయం ఏంటంటే, మీటింగులో బాణం గురి ఎందుకు తప్పిందా అని ఆలోసించాల- మనం అడిగేవన్ని అత్యాసలంటున్నారు- దీనికేదో లొసుగుండిఉండాల. లాపోతే లేబర్ శెక్రట్రీ ఏటి, రాడమేటి? అటు ఆళ్ళకీ చెప్పలేకపోనాడంటే మన్లో స్టాంగుండాలన్నమాట- ఇటు మన గొడవ తేల్చలేకపోయాడంటే ఏదో ఉంది-" రంగసామి మనుషుల ముఖాల్లోకి చూశాడు.

"ఏటి లొసుగు! మనుషులు సవ్వరాదంటే లొసుగా, సొమ్ములివ్వండి బత కాలంటే లొసుగా, మనుషులకు పనీండి అని మరియాదగా అడిగితే లొసుగా" విసురుగా అన్నాడు చిట్టి- అందుకే చిట్టి అంటే చిరాకు పడ్తాడు రంగసామి. 'దూకుడు' దూకుడు పన్చీయదు గురూ' అంటాడు రంగసామి.

"ఏటింతసేపూ టాపెగిరీలా ఎగిరిపోడమేనా, కొంత బుర్రెట్టి ఆలోసించాలా అని సూట్టం లేద్మేటి- ఏటి యూనియన్ జనాలం వెయ్యిమందయితే, పదేలు అంతా కల్సి. ఏటి మనం సెప్పింది ఆళ్ళు ఇంటారా లేదా అని సూడాలా వద్దా?"

"ఇయాళ ఆళ్ళు మనాళ్ళు కాదేటన్న సింత పట్టిందేటి? అయినా ఏటి యూని యనో ఆళ్ళందరూ కాజుయల్ అని ఆ నాకొళ్ళు దగాసేస్తుంటే బొమ్మలా నిలబడి పోయింది."

'చిట్టీ.' అన్నాడు రంగసామి గట్టిగా. అతనికి చిట్టిమీద మెల్లిమెల్లిగా కోపం పెరిగిపోయింది- ఈమధ్య కొద్దికాలంగా చూస్తున్నాడు రంగసామి- చిట్టి రోజురోజుకీ అడ్డదిడ్డంగా తయారవుతున్నాడని అతని అభిప్రాయం.

"ఏటి? ఉన్నమాటంటే మసయిలా సుత్తావేం?" అన్నాడు చిట్టి- అతను లేవ బోతే అప్పల్రాజు కూర్చోబెట్టాడు.

"చిట్టి నీకందుకీ అంటను, ఆలోసించాల్రా అని- గవర్నమెంటోడు వచ్చి ఏటీ చెప్పనేదంటే ఏటన్నమాట- నే సెప్తాను నువ్వినూ- అలాగ ఎగిరిపోకు-

ఆళ్ళేటంటారంటే కూట్ల బరూలుకి మేం ఏంచేస్తాం అంటారు- మరి రూలు ప్రకారం ఉన్న బరువులు వీళ్ళు మార్చలేరుగదా? అందుకేటంటానంటే మరంత బరూ అయితే కూలి రేటయినా పెంచొచ్చుగా అని- గవర్నమెంటోళ్ళకి బరువులు మార్చండని రాస్తాం అంటారు గాని రేటు పెంచమన్రే- అదీ నాకు మంట- ఇకపోతే,

బోనసంటాం- అదియూల కాబోతే రేపిస్తావంటారు- కాబోతే పదివేలమందికీ ఎందుకిస్తాం అంటారు- పదీ వేలమందికీ యియ్యండని మనం అడిగామా- ఒరే అబ్బి నీ యూనియన్ కానోళ్ళకి ఇమ్మనంటున్నావు గదా, రేపాళ్ళేదయినా మాగ్గొడవలు తెచ్చిపెడితే నువ్ ఆరుస్తావా తీరుస్తావా అంటారు- అసలీళ్ళకి బోనస్ ఏంటి, రోజుకో చోట పన్జేసుకొనీవాళ్ళకి అంటారు- అల్లాటప్పాగా కొట్టీటంగాదు- నాకు తిక్క రేగిందా కోరుటు కెళ్ళితీర్తాను అది యేరే సంగతి- కానయితే కోర్టు కెళ్ళితే గెలుస్తామా అని సూడాల- కోర్టుకెళ్ళి లేబరోళ్ళ యూనియన్ పోయిందంటే 'సీ' అంటారు మనోళ్ళే- రేపీళ్ళు అదీపనిగా కొట్లు తెరవం అంటే కోర్టువాళ్ళు తెరిపించీస్తారు- మనం ఏటి సేసాం అని కొట్లు మూసీవాలి? గొడవలయ్యాయంటే అవలా అవుతూనే వుంటాయి.

అదికాక తీసేసినోళ్ళను వెయ్యండ్రా అని కేసిట్టాలా అంటే దానికీ రూల్సుం టాయి గదా? ఆ నాకొళ్ళు బుర్రలేని నాకొళ్ళు, వారాని కోసారీ, పది రోజుల కోసారీ జనం పేర్లు మార్చిపారేస్తుంటే, ఏటని కేసిట్టాం ఏటి పర్మనెంటు సెయ్యమంటాం?

రేటు పెంచి, యూనియన్ వాళ్ళకిమాత్తరం బోనస్ అంటే కుదుర్తుంది- అదే సూత్తన్నాను- ఏటి సెయ్యమంటారు?" రంగసామి ముగించాడు.

"దంచీసారు గురూగారూ" అన్నాడు అప్పారావు.

చిట్టి మళ్ళి చిరాగ్గా చూసాడు-

"అదన్నేయం- మందకి నోరులేదుగదాని గాలికొగ్గీటం" అన్నాడు.

"ఆశ్చేటి ఎండినాకులేంటి గాలికెగిరి పోటానికి?" రంగసామి విచిత్రంగా నవ్వాడు— "అయినా యూనియన్ కేటిమంచి, ఏది పెద్దన్నది నాకొగ్గీయండి, యూని యన్‌కి ఫలానాది సామూలకంగా జరగలేదూ అనీయండి, ఈ సిగరెట్టు మానీస్తాను" రంగసామి సిగరెట్ కాలికింద పడేసి నొక్కి, ఇంకో సిగరెట్టు తీసాడు— అతనింకా ఏదో అంటూఉండేలోగా—

"పట్టుకో పట్టుకో" అని గట్టిగా అరుపులు విన్పించాయి— మనుషులు పరిగె ట్టడం— గోలగోల.

దబ్బుమని చప్పుడయింది రూములో.

అంతకన్న ఎక్కువ చప్పుడుతో టేబులుమీద రెండు డబ్బాలు పడ్డాయి.

అవి టేబులుమీద పడేసినతను చెమటతో తడిసిపోయిఉన్నాడు— చేతులకు మట్టి అంటుకు పోయివుంది— నేలమీద పడినట్లున్నాడు కాళ్ళు కొట్టుకుపోయి మోకాలి దగ్గిర రక్తం కారుతోంది.

అతని వెనకే ఓ మనిషి పరిగెత్తుకొంటూ లోపలకు వచ్చాడు.

వెనకాలే కొట్లవాళ్ళు కొంతమంది పరిగెత్తుకొంటూ వచ్చారు— అతను డబ్బాలు టేబుల్‌మీద పడెయ్యగానే ఓ నలుగురు అతని పట్టుకు గుంజారు— ఒక్క దెబ్బతో రూము బయటకు లాక్కుపోయారు వాళ్ళు.

"అరె, అరె, ఏంటిది—" అన్నాడు రంగసామి. అతనికి ఏం జరిగిందో అర్థంకాలేదు— చిట్టి గబుక్కున లేచి బయటకు వెళ్ళిపోయాడు.

వాళ్ళు అతన్ని పట్టుకొని చేత్తో కొట్టబోతుంటే అడ్డంగా వెళ్ళాడు.

"ఏటయిందీ—" అనరిచాడు.

"దొంగ నాకొడుకు— డబ్బాల్దొబ్బుకెళ్ళామనే— వెంటపడితే ఇందులో దూర్తున్నాడు" అన్నాడొకతను.

ఇంతలో రామారావు మధ్యలోకి వచ్చి "పోన్లెండి, వొదలెయ్యండి అతన్ని ఎందుకు గొడవ?" అన్నాడు.

ఇంగాక రామారావు నెయ్యి డబ్బాలు కొనుక్కొని బయటకు రాగానే అక్కడ గుంపు మనుషులు ఉన్నారు— వాళ్ళంతా కింద కూర్చునీ, కొంతమంది నిలబడీ కొట్టు కొంటున్నట్లు మాట్లాడుకొంటున్నారు— అతను బయటకు రాగానే, ఎవరో ఏదో అరి చారు— కొనుక్కెళ్ళడం కుదరదన్నారు ఎవరో— పట్టించుకోనట్లు వచ్చేస్తుంటే చేతుల్లోవి

ఎవరో లాక్కొని పరిగెత్తారు- కొట్లవాళ్ళు, కొందరు అక్కడే వుంటే చూసి పరిగె త్తారు- వాళ్ళ వెనకే కూలీవాళ్ళు పరిగెత్తారు- అదీ జరిగింది.

"మాకయితే కొట్లు మూసీసాం అంటారు- మీకయితే సొమ్ములకమ్ముకుంటన్రు" వగరుస్తూ- ఆ డబ్బాలు ఎత్తుకొచ్చినతను.

అంతలో వెనకాల పరిగెత్తుకొంటూ వచ్చారు పోలీసోళ్ళు.

"దొంగతనం" అంటూ అతన్ని తీసికెళ్ళారు.

తర్వాత అక్కడ రంగసామికీ, చిట్టికీ ఇంకా కొంతమందికీ గొడవ అయింది.

"సామాన్లెవడయినా కొనుక్కుంటే, లాక్కోమన్లేదే- అయినా అదు యూనియన్లో అయినా లేదు ఏంసెయ్యను; అయినా వాణ్ణి వొగ్గీసీలా చేసే పూచీ నాది" అన్నాడు.

* * *

పదేళ్ళ క్రితం-

కొంతకాలం రంగసామి బస్తాలు మోసాడు, పేకీజీ చెక్కలు ఎత్తాడు- లారీల్లో సామానులు దించాడు- అప్పట్లో మనుషులు అంత ఎక్కువగా లేరు- బజారు ఇవా ళంత పెద్దదీకాదు- అందరూ కలిపి ఓ పదిహేను వందల మంది కూలీలు ఉండేవాళ్ళు.

బస్తీలో ఉండేవాడు గానీ అతనికి బస్తీ వదిలి కొద్దిగా అవతలవున్న పెంకు టిళ్ళలోకి మారి కొంత జీవితం బాగుపర్చుకోవాలని ఉండేది- జీవితాలు బాగుపర్చుకో వాలంటే అట్లాంటివి కూలివాళ్ళ చేతుల్లో ఉండవని అతనికీ తెల్సు.

ఓ కూలిమనిషి పెళ్ళాంతో ఓ కొట్టు ఓనరు బావమరిది కొంచెం వెర్రివేషాలు వెయ్యగా, ఉన్న కూలీలు రెచ్చిపోయారు- గొడవ ఉద్రిక్తం అయేసరికి రంగసామి కలుగజేసుకొన్నాడు- మిగతావాళ్ళతోపాటు అతనూ రెచ్చిపోయాడు- అప్పుడయిన కొద్ది పాటి కొట్లాటల్ని సమర్థవంతంగా ఎదుర్కొనేసరికి జనాలకి అతనిమీద ఓ వెర్రి నమ్మకం ఏర్పడింది- ఓ రెండువందల మంది కూలీలతో ఓ యూనియన్ వెలిసింది- ఆ యూని యన్‌కి అప్పట్నుంచీ అతనే ప్రెసిడెంటుగా ఉండిపోయాడు.

యూనియన్ పెట్టిన కొత్తలో, ఎవళ్ళో వేరే యూనియన్‌ల వాళ్ళు వచ్చి "మనం అందరం ఒకటే" అంటే నిజమే అన్నాడు- అందరమూ ఒకటే అవటంలో కొన్ని లాభాలు ఉన్నాయని గ్రహించిన రంగసామి దాని మూలంగా యూనియన్‌ని ఇంకొంచెం బలంగా చేసాడు- ఎప్పుడయినా అన్యాయాల్లాంటివీ, గొడవలూ అయినప్పుడు ఇతర జనం కూడా వచ్చి గొడవగొడవ చేస్తే, కొన్నింటిని సాధించాడు.

మూడు నాలుగు సార్లు కూలిరేట్లు తక్కువని గొడవ చెయ్యగా వాళ్ళు రేట్లు పెంచారు— దాంతో వీళ్ళకి అతను దేవుడయి కూర్చున్నాడు.

మొట్టమొదట్లో యూనియన్ గొడవలు అతన్ని చికాకుపెట్టినా కొంతకాలంకి దానికి కొద్దిపాటి బలం రావటంతోనూ, ఇతర యూనియనులు మద్దతు ఉన్నాయనే నమ్మకంతోనూ అతను కొంచెం తన గురించి తాను గొప్పగా అనుకోటం మొదలు పెట్టాడు— యూనియన్‌లో ఉన్నది వందల మీదయినా తను చెప్పినది వేలమంది వినే స్థితి రావటంతో అతన్లో కొంచెం మార్పు వచ్చింది.

'రంగసామి లీడరు' అని అతని మనసులో స్థిరపడిపోయింది— కొట్ల వాళ్ళకి రంగసామి మాటలు అందరూ వింటారన్న నమ్మకం ఏర్పడేసరికి అతనంటే ఓరకం కోపమూ భయం పట్టుకొన్నాయి— (అయితే వాళ్ళ పద్ధతులు వాళ్ళకు లేకపోలేదు— మనుషులు మారతారనీ, వాళ్ళ దృక్పథాలు మారతాయనీ కొంతమందికి జ్ఞానం ఉంది.)

అయితే రంగసామికి 'తను లీడర్' అని అనుకొన్నాదేగానీ, ఆ బలం వెనక వున్న కూలి జనాల అండ అనీ, వాళ్ళందరూ కల్సి తన మాట వినటంవల్లె అది వచ్చిందనీ కొంతకాలంకి మర్చిపోయాడు.

"కూలివాళ్ళకి ఇంతకంటే ఎవడేటి సేస్తాడు—" అనేవాడు.

కూలివాళ్ళ పేర్లు వారానికీ పదిరోజులకీ మార్చి రాస్తున్నారని తెలీగానే అతను బజారు సంఘం వాళ్ళని కలిసాడు— రంగసామి రూల్సు ఇలాంటివి ఎలా తెల్సుకొంటు న్నాడన్నది వాళ్ళకి విచిత్రిం అన్పించింది.

అట్లాంటి పద్ధతులు అలాగే సాగితే, తనకి లాభం అని అతనికి తెల్సింది— (కూలీవోళ్ళకి ఏం పేర్లు ఏ రకంగా రస్తారో తెలీదు.)

ఆ తర్వాత అతను బస్తీ నుంచి కొద్దిగా దూరంలో ఉన్న పెంకుటింట్లోకి మారాడు— యూనియన్ గొడవలు చూట్టానికీ, కాయితాలు ఉంచటానికీ జాగా ఉండక పోతే బావుండదని అతనే అన్నాడు— లీడర్ అన్నవోడు అల్లాటప్పాగా గుడిసెల్లోఉంటే కొట్లవాళ్ళు మాట వినరన్నాడు.

కూలీ వాళ్ళు నిజం అంతే అనుకొన్నారు.

ఎందుకంటే అప్పుడప్పుడు కూలిరేట్లు రంగసామి గోలచెయ్యగా పెరుగుతూనే ఉన్నాయి.

తర్వాత కొంతకాలంకి గవర్నమెంటు మారటంతో యూనియన్ వాళ్ళు ఎవర్ని సపోర్టు చేస్తారు అన్నచోట గవర్నమెంటుని బలపరిస్తే మన మాట వాళ్ళు వింటారని అన్నాడతను— అతనికి ఎప్పుడు ఏం చెయ్యాలో తెలీటంవల్లే అటు కూలీవాళ్ళకీ ఇటు వర్తక సంఘం పెద్దలకీ అతన్తో రోజులు సాఫీగా సాగుతూనే వచ్చాయి.

మళ్ళీ కొంతకాలంకి మళ్ళీ గవర్నమెంటు మారగానే ఇతర యూనియన్ వాళ్ళు కొంచెం గొడవ అవసరం అన్నారు.

బజారువాళ్ళు కొత్తగా వచ్చిన గవర్నమెంటుని కాక ఓడిపోయిన వాళ్ళని సపోర్టు చేసారు.

అంతకు ముందూ చాలా గొడవలు, దారుణంగా కొట్లాటలు జరిగాయి— చాలా మంది కూలీల శవాలు పక్కనే పారుతున్న నదిలో కొట్టుకుపోయాయి— కూలీ జనాలకి 'కొంపా-జనం' అన్న వాళ్ళు లేకపోవడంతో వాళ్ళు చచ్చి ఉన్నారో బతికి ఉన్నారో ఎవళ్ళకీ అక్కర్లేకపోవటంతో అట్లాంటివి బయటకు రాలేదు.

అయితే చాలకాలంకి రంగసామి రంగంలో దిగాల్సిన అవసరం వచ్చింది.

జనాలని జంతువుల్లా వాడుతున్నారని వూరేగింపులు జరిపీ, బస్తీలో మీటింగులు పెట్టీ అరిచాడు.

దానికితోడు పరిస్థితులూ కల్సివచ్చాయి.

ఓ సమయానికి విషయం ఎట్లా వచ్చిందంటే, 'అమ్మిన సరుకులు ఎత్తుకెళ్ళ టానికి కూడా' కూలీలు ఎవళ్ళూ ముందుకు రాలేదు— "రంగసామి అంటే ఏం అనుకొన్నారో ?" అన్నాడు రంగసామి.

* * *

రెండుమూడు రోజుల్నుంచీ పేపర్లనిండా గందరగోళంగా వార్తలు పడ్తోన్నాయి.

'ఆహార వ్యవహారాల శాఖవాళ్ళు ఎందుకు చేతులుముడుచుకొని కూర్చునిఉన్నారో అర్థం కావటం లేదని' కొట్ల సంఘం వాళ్ళు అంటే,

'కొట్ల సంఘం తాలూకా పెద్ద మనుషులెవరూ తమని ఖాతరుచెయ్యటం లేద'ని లేబర్ డిపార్టుమెంటు వాళ్ళు నిస్సహాయత వెలిబుచ్చారు.

'పోర్టర్ల ఆగడాలు మీరిపోయి మాలో కొంతమంది ఆస్పత్రిలో చచ్చేలావుంటే లా అండ్ ఆర్డరు చూడటంలేదు పోలీసువాళ్ళు' అనంటే;

'అదంతా వట్టిది' అని పోలీసువాళ్ళు.

'అయినా రోజూ కోటిరూపాయలు దాటిపోయేలా డబ్బులు గడించేవాళ్ళందరూ కల్సి కూలీవాళ్ళకి కొద్దిపాటి బోనస్‌లాంటిది ఇవ్వలేకపోవటం సిగ్గుచేటు' అని లేబర్.

'గవర్నమెంటువాళ్ళు ఫలానాదీ అని నిర్ణయించి ఆర్డరు ఇస్తేగానీ మేం ఇవ్వం' అని కొట్లవాళ్ళు.

ఈలోగా ఓ కూలీవాణ్ణి అరెస్టు చేసారు దొంగతనంమీద- తర్వాత అతన్ని వొదిలేసారు- అది దొంగతనం కాదని.

'అన్ని వస్తువుల రేట్లూ రాకెట్లలాగా పైకి వెళ్ళిపోతే మేం చస్తాము' అని పౌరుల లేఖలు.

* * *

నీలమ్మ దిగులుగా కూర్చుంది.

ఆమెకి వళ్ళంతా చచ్చిపోయినట్లు నొప్పిగా వుంది- పక్కనేవున్న చంటిపిల్ల గట్టిగా ఏడుస్తోంది.

రెండు నెలలు దాటిపోయింది—

అంతకుముందే ఓపూట తిండిగింజలుంటే ఓరోజు ఉండని గతి- ఇప్పుడదీలేదు.

చంటిపిల్ల పాలకోసం కాబోలు ఇంకా గట్టిగా ఏడుస్తోంది.

నీలమ్మకి పాతికేళ్ళుదాటి రెండేళ్ళే అయినా ఆడదానికి ఉండాల్సినంత రొమ్ములు ఆమెకీలేవు- ఇంతకుముందు ఉండేవేమో గానీ ఇప్పుడవి ఎండిపోయాయి.

చిన్నగాఉన్న రొమ్ముల మచ్చికలు చీకిచీకి ఏమీరాక చంటిపిల్ల ఏడుస్తూనేఉంది.

చిన్నప్పుడు పల్లెటూర్లో ఉన్నప్పుడు నీలమ్మ పొలాల్లో వెళ్ళినప్పుడు పచ్చగా కన్పించే గడ్డిపరకలు అప్పుడప్పుడూ నవుల్తూఉండేది- అవి కొద్దిగా ఉప్పగా వుల్లగానూ నీలమ్మకి రుచిగానూ ఉండేవి- అయితే ఆకలిమీద నవిలేది కాదుకాబట్టి ఉమ్మేసేది.

ఆమె ఇందాకట్నుంచీ కొంచెం దూరంలో ఉన్న కాలవవైపు చూస్తోంది- ఎందుకో ఒక్కసారిలేచి అటుగా వెళ్ళింది.

కొద్దికొద్దిగా వెన్నెల పడ్తున్న కాంతిలో కాలవ నీళ్ళు కదుల్తూ కనిపిస్తోంది- గట్టువారన మొక్కలున్నాయి- నీళ్ళ వొడ్డున గడ్డి పెరిగింది.

నీలమ్మ గడ్డి పీకుతూ కూర్చుంది- కాసేపటికి రెండు దోసిళ్ళలో గడ్డి తయారయింది- ఆ తర్వాత అక్కడే కూర్చుని, మెల్లిగా ఆ గడ్డంతా తింది- కొద్దిగా ఆకలి

తగ్గిందనిపిస్తే, నీళ్ళు తాగింది- కడుపులో వికారం అన్పించింది గానీ, ఇందాకట్లా ప్రాణం పోయే నీరసం అన్పించలేదు ఆమెకి.

'గేదెలకే కాదు, మనిసికీ ఇదే తిండీ' అనుకొంటూ మెల్లిగా గుడిసెలవైపు నడిచింది.

*          *          *

"ఏటి సెయ్యమంటావ్- సవ్వమంటావేటి?" కసిరాడు అప్పల్రాజు.

గుడిసెలో కిర్సనూని దీపం ఇంతకు ముందయితే ఉండేది గానీ ఇప్పుడులేదు- గుడిసెలోపల అంతా చీకటిగానే ఉంది.

బయట మసక వెన్నెల.

లోపల కూర్చుని ఉన్న వాళ్ళకి చీకటి అలవాటయిపోవటం వల్ల ఒకళ్ళ ఆకారాలు ఒకళ్ళకి లీలగా కన్పిస్తున్నాయి.

"అదేట్రా, కసురుకొంటావు నాయన" అన్నాడు నాయుడు.

"కానయితే ఏటిసేసేది సెప్పు, ఆ లంజికొళ్ళే కొట్లుతీయరు- మనకా పనుల్లేవు- ఎళ్ళేవాళ్ళు ఎళ్తారుగానీ సొమ్ములా మాకు లేవాయి- సావాలా? వూరు పొతే కసింత గడ్డయినా తిని సావచ్చు- పట్నంవని వస్తే పీణాలు పోతున్నయి" అన్నాడతను.

"ఏటందరూ సచ్చిపోయినట్టు, ఎవడికాడు కాడికెళ్ళిపోతే కొట్లు తెరుస్తారు గానీ మనం బతకం" అన్నాడు చిట్టి.

"అదీ నిజమేనాయె- కానీ చిట్టిగా, నే సవ్వలేనురా-"

"నువ్వు సవ్వపద్దు- మనం బతకాల- అందరం వుంచేనే మనం బతుకుతం" అన్నాడు చిట్టి.

అప్పల్రాజు ఉండిపోవటానికి వప్పుకొన్నాడు.

*          *          *

ఇంకా తెల్లవారలేదు- మసక వెన్నెల ఇంకా అలానే వుంది

అక్కడంతా హడావిడిగా వుంది.

చిట్టి రాత్రి పన్నెండు గంటల్నుంచీ గుడిసెలన్నీ తిరుగుతూనే ఉన్నాడు- అతనికి మనుషులంతా జీవంలేనట్లు దిగాలు పడిపోయినట్లు అన్పించింది.

"లేవండెహె, ఈ పాటి దానికేటంత అదయిర్యం పడిపోతున్నరు? లేవండి" అన్నాడతను.

"ఏటి సెయ్యమంటావ్ సిట్టిబాబూ— ఈ కూలోడి కర్మం ఇలాగ మసయి పోతంటే—"

"ఏటి బజార్లేకుంటే బతుకుల్లేవేంట్రా— లేవండి లేవండి, అందరం కల్సి పనులు ఎతుకుదాం— ఎవడికేది దొరికితే అదే బతుకు లేవండి."

చిట్టి రాత్రి పెట్రొమాక్సు లైట్లు కొన్ని సంపాదించాడు.

రాత్రి మూడయేసరికి వాటన్నింటినీ చిట్టి, ఇంకో పదిమందీ కలిసి వెలిగించారు— "ఏటో ఏటవుద్దో" అంటూనే ఉన్నారు వాళ్ళు.

గుడిసెలన్నీ గందరగోళంగా వున్నాయి— ఎవరికీ నిద్దర్లు లేకపోయినా మొఖాలు నిద్రపోవాలన్నట్లుగా లేవు.

అంతా కలిసి జనం పోగయ్యారు.

చిట్టి ఓ డప్పు పట్టుకు కొట్టటం మొదలుపెట్టాడు.

"పదండోయ్ సాములూ, వూరల్లా తిరుగుదాం— దొరికిందే పని చేసుకొందాం" అంటూ, చప్పుళ్ళకి ఇంకా మంద చేరారు.

పెట్రమాక్సు లైట్లు మధ్య పెట్టి చుట్టూతా మనుషులు గెంతుతూ పాడుతున్నారు— 'మనుషులు చావకూడదనీ, చచ్చేదాకా పనికోసం పెనుగులాట తప్పదనీ' ఆ పాటల అర్థం— అవి ఎవరూ రాయలేదు— రోజూ మాట్లాడే మాటల్నే పాటలుగా పాడారు.

పాటల్తో మొదలయిన గుంపు మెల్లిగా పెట్రొమాక్సులన్నీ పెట్టుకొని బయల్దేరారు— అంతా కలిసి నాలుగయిదు వందలమంది తయారయారు.

గుంపంతా దీపాల్తో కదుల్తుంటే బస్తీలోఉన్న వెలుగంతా మెల్లిమెల్లిగా వూర్లోకి పాకిపోతున్నట్లు కనిపిస్తోంది— "ఏటో సిట్టిబాబుకి ఆశ—" అన్నారు వుండిపోయినవాళ్ళు.

వూరింకా నిద్ర లేవలేదు.

రోడ్లన్నీ ఖాళీగానూ, వికారంగానూ వున్నాయి— తెల్లవారితే అవన్నీ ఇరుగ్గానూ చీదరగానూ తయారవుతాయి— పెద్దరోడ్లూ చిన్నరోడ్లూ అన్ని నడుచుకొంటూ వాళ్ళంతా నడుస్తూనే ఉన్నారు— నడుస్తూ పాటలు పాడుతూనే ఉన్నారు— కొంతమంది గెంతుతున్నారు— చిట్టి కొంతమందితో ముందు నడుస్తూ దారిచెప్తున్నాడు.

రాత్రి చీకట్ని ఇంకా వదల్లేదు.

దూరంగా కన్పిస్తున్నాయి మిణుకుమిణుకు మంటూ చిన్నచిన్న వెలుగుకాంతులు. దూరంగా అదంతా ఎందుకూ పనికిరాని ఖాళీ ప్రదేశం చీకటుంది— దానికి కొద్దిగా అవ

తల శ్మశానం వుంది- కాళీ ప్రదేశం నిండా బస్సులూ ట్రక్కులూ ఆగివున్నాయి- వాటి మధ్య ఇరుకు ఇరుకుగా చోటుంది- ఆ ఇరుకులోనే వున్నారు మనుషులు- వాళ్ళ దగ్గిర చిన్నచిన్న కిర్సనాయిలు దీపాలు వున్నాయి- అక్కడేవున్నాయి నీళ్ళతో బక్కెట్లు.

"పదండి పదండి" అంటూ ఇంకా వేగంగా ముందుకెళ్ళాడు చిట్టి.

పెట్రొమాక్సులైట్లూ, చప్పుళ్ళూ, అరుపులూ విన్పించిన వాళ్ళందరూ బస్సుల మధ్యనుంచి బయటకువచ్చి నిలబడ్డారు- వాళ్ళకి దూరంగా గుంపు కన్పిస్తోంది- వాళ్ళకి ఏమి అర్థంకాలేదు- బస్సుల మధ్య నుంచి వచ్చిన క్లీనర్లూ, చెక్కర్లూ అందరూ కల్సి ఓ రెండొందల మందున్నారు.

"ఏటి జట్టి అవుతుందేటి" అన్నాడతను.

"అదే తెలవట్లేదు" అన్నాడు ఇంకొకతను.

లైట్లూ మనుషులూ దగ్గిరకు వచ్చారు- "ఏట్రా సిట్టీ ఏటిదంతా, ఏటీ దండ యాత్ర" అన్నాడు దేవుళ్ళు ముందుకొస్తూ.

చిట్టి పరుగు పరుగున ముందుకు వచ్చేసాడు- మిగతావాళ్ళు మెల్లిగానే నడుస్తున్నారు- "ఇవి చేతులుకావు, కాళ్ళురా దేవుళ్ళూ- జనమంతా మాడి సత్తన్నారు, గడ్డయినా పీకు తింటానికి- గంజయినా వస్తుందని అందరం కదిలాం" అన్నాడతను.

"అయితే మాఁ వేమిటి సేత్తాంరా?" అన్నాడతను.

"ఏటీ లేదర్రా రాత్రిళ్ళు బస్సులు కడగటం, క్లీన్ సెయ్యటం మావోళ్ళకి కొంతమందికిచ్చేసి, రాత్రిళ్ళు కసింత తొంగోండి మీరంతా- టీ నీళ్ళకీ రొట్టెముక్కకి జీతాల్లో ఓ పావలా ఇయ్యండి, అంతే మీలాటి పనోళ్ళమే- మీరంతా కాదంటే సచ్చిపోతం" అన్నాడు.

క్లీనర్లందరూ ముఖాలు చూసుకొన్నారు.

"అవునీళ్ళకీ ఇంత గెంజి లేకుంటే ఎట్లా, మనకా పనికి బొక్క సినిగిపోతోంది. నాలుగు బీడీల సొమ్ములు తక్కువయితే వచ్చింది యేమ్లేదుగానీ, రండర్రా- బజార్లుమూసి మిమ్మల్ని సంపుతున్నారు, మమ్మల్నీ సంపుతున్నారు- ఉండండెహె" అన్నాడతను.

దాంతో కొంతమంది చిట్టితో వచ్చిన వాళ్ళు బస్సులమధ్య దూరిపోయారు. అప్పటిదాకా కడుగుతున్నవాళ్ళు 'కాసేపు తొంగుందాం'మని బస్సు సీట్లలో పడకేసారు.

"పదండర్రా మిగతావాళ్ళం వేరే సూద్దాం-" అన్నాడు చిట్టి.

మళ్ళీ గుంపంతా కదిలింది.

పావలాలకీ అర్ధరూపాయిలకీ మనుషులకి పని బేరం ఆడుతున్నందుకు చిట్టికి బాధగా అన్పిస్తోంది గానీ, అదీ నిజ్కా, పావలా రొట్టయినా లేకపోతే జనం ఇంకా దీనంగా తయారయిపోతారన్న నిజం అతనికి ధైర్యం చెప్తోంది– దరిద్రం మనుషులని దిగజారుస్తుంది గానీ వందల మంది మనుషులు ఇలా రొట్టెముక్కకోసం నిద్దర్లయినా లేకుండా వెతుకులాడే దౌర్భాగ్యాన్ని అసహ్యించుకున్నాడు.

"దేశం ఇచ్చింది ఇంతే–" అని అతను అనుకోలేదు. "దేశంలో లఫ్డీకొళ్ళు పన్నే దొంగ లంజ నాటకం" అనుకొన్నాడు.

తెలతెలవారుతోంది వాళ్ళు మళ్ళా ఊరుమధ్యకి వెళ్ళేసరికి.

అప్పటికీ వీధుల్లో మనుషులు తిరగటం మొదలయిపోయింది.

వెల్తురు కొద్దికొద్దిగా వస్తున్నా పెట్రొమాక్సు లైట్లు ఇంకా ఆర్పలేదు వాళ్ళు– కొద్దికొద్దిగా జనాలతో ఉన్న రోడ్లు వాళ్ళందరితో రద్దీగా తయారయాయి– ఇంకాసేపయే సరికి వాళ్ళు మరో గుడిసెల ప్రదేశంకి చేరారు.

ఓ గుడిసె బయట అంతా ఖాళీ ప్రదేశం వుంది.

గుడిసెకి ఆనుకొని ఓ బోర్డుకూడా వుంది– ఏదో రిక్షా కార్మిక సంఘం బోర్డది. ఆ ముందు చాలా రిక్షాలు వున్నాయి– దాదాపు అన్నింటిలోనూ రిక్షాల్లాగేవాళ్ళు పడుకొని నిద్రపోతున్నారు– వాళ్ళందర్నీ తట్టి లేపేసరికి చాలాసేపట్టింది.

"ఏటి గోల" అని విసుక్కొంటూ లేచారు కొందరు.

తర్వాత కన్పించారు వాళ్ళంతా. కొద్దికొద్ది వెలుగులో పెట్రొమాక్సు లైట్లు కాంతి పోగొట్టుకొన్నట్లు కన్పిస్తున్నాయి– అందులో కొందరి రిక్షావాళ్ళను గుర్తుపట్టారు. మళ్ళీ చిట్టి బేరం పెట్టాడు– వాళ్ళు రిక్షాలు లాగలేనప్పుడు ఎంతో కొంత సేపు 'మావోళ్ళకి' ఇమ్మని. వాళ్ళు చాలాసేపు ఆలోచించారు– 'ఏటి గొడవవుద్దో' అంటూ గొణిగారు– "ఏటీ అవద'న్నాడు చిట్టి– ఆఖరికి మద్దేనంపేళలో కొంతమంది ఇస్తాం అన్నారు– రేత్రి బాగా అయింతర్వాతయితే అస్తాం అన్నారు ఇంకొంతమంది– కొంత మంది అప్పటిదాకా రిక్షాలుతొక్కి– వొళ్ళు నొప్పులొచ్చిన వాళ్ళు అప్పుడే ఇచ్చారు.

చిట్టి మొఖం కొద్దిగా తేటపడింది.

'ఫేక్టరీల్లో కేజువల్ మనుషులు కావాలేటో సూద్దాం' అంటూ మళ్ళా నడిచాడు– తెల్లవారి సూర్యుడు ప్రపంచం మీదకి రాగానే వాళ్ళు లైట్లు ఆర్పేశారు.

దూరంగా గుంపును చూస్తూనే ఫాక్టరీ గేటు దగ్గిరున్న జవాను గేటు బయటకు వచ్చి 'క్యా?' అన్నాడు. మనుషులెవరూ అక్కర్లేదని కంపెనీ తరపున ఖరాకండీగా చెప్పేశాడు. అలా వాళ్లంతా ఐదారు పెద్ద పెద్ద ఫేక్టరీలు తిరిగారు గానీ ఎక్కడా గేటు దాటి లోపలకు వెళ్లలేదు.

కొంచెందూరంగా కొండలున్నాయి. దానికున్న దారంతా అడ్డ దిడ్డంగా వుంది. తుప్పల్లోంచీ, డొంకల్లోంచి మనుషులంతా విసుగూ విరామం లేకుండా నడిచివెళ్ళేసరికి ఎనిమిది గంటలయింది–

కొండపక్కన ఐదారు లారీలున్నాయి.

కొంతమంది రాళ్ళు కొడుతుంటే, కొంతమంది తట్టల్లో రాళ్ళు లారీలోకి ఎత్తుతున్నారు– వాళ్ళమధ్య ధుమధుమలాడిపోతున్నాడు మాలచ్మినాయుడు– ముందు రోజు బరంపురం నుంచి వచ్చిన మేస్త్రి లేబర్ జనాలు దొరకలేదని చెప్పాడు– దాంతో పని టయింక్ అయేలా లేదని అతని ఖంగారు– వూర్లో జనాలు రాళ్ళు కొట్టటానికి దొరకరా అంటే అదీలేదు– కావొప్పతే కొందరు జనం చపక కొందరు ఎక్కువ సొమ్ములుచ్చుకొంటారు.

గుంపు చూస్తూ "ఏటి బరంపురం ముఠా ఏటి?" అన్నాడు– కాదన్నాడు పక్కనే ఉన్న మేస్త్రీ– "మరెవళ్ళు" అన్నాడు నాయుడు.

కాసేపటికి తెల్సింది నాయుడికి– వాళ్ళు ఎవళ్లయినా– రాళ్ళు కొట్టాటానికి తయారుగా వున్నారు. అని ఇంకా వాళ్ళ డొక్కలు చాల రోజుల్నుంచీ మాడుతున్నాయని కూడా తెల్సింది.

"జనం కావాలి కానీ, బరంపురం వోళ్ళు రావాల." అన్నాడు నాయుడు చిట్టితో.

"కాదు, బాబ్బాబు ఆళ్ళొచ్చేదాకయినా ఇంత పనియ్య."

"కానయితే– ఆళ్లొస్తే మీరెళ్ళి పోవాల. అదీ కాక...." అనాగిపోయాడు నాయుడు, కాసేపాగి "అప్పు జనాలు ఎస్తంటున్నావ్. మరి పనేటిసేస్తార్రా?" అని నవ్వాడు. చిట్టి ముఖం విచారం అయిపోయింది.

"మనిషికో రూపాయిస్తార్రా– మరిష్టమయితే ఓ వందమందుండండి–" అన్నాడు.

వందమంది ఉండి పోయారు.

*  *  *

పెద్దరోడ్డు జంక్షన్‌లో అన్ని వైపులకీ ఎర్ర సిగ్నల్ వచ్చింది. రోడ్డు దాటి వెళ్ళాల్సినవాళ్ళంతా ఖంగారుగా కార్ల ముందు నుంచి అవతల వైపుకి నడుస్తున్నారు.

కార్లన్నీ బారులు తీరి ఆగిపోయాయి.

ఫుట్‌పాత్ మీద నిలబడి వున్నారు వీళ్ళు ఓ పాతిక మంది.

సిగ్నల్ వచ్చి కార్లు ఆగిపోగానే కార్ల మధ్యకి పరిగెత్తారు.

"బాబూ ఓ ఐదు పైసలియ్యండి బాబూ- ఆకల్తో సచ్చిపోతున్నాం-"

వాళ్ళకి పోటీగా రోజూ అడుక్కొనేవాళ్ళు కూడా 'ధర్మం బాబూ' అంటూ కార్ల మీద పడ్డారు- రెండు నిముషాల తర్వాత కార్లన్నీ వెళ్ళిపోయాయి.

'యీళ్ళెవళ్ళు' అంటూ విసుక్కొన్నారు రోజూ వుండేవాళ్ళు.

మధ్యాహ్నం అయేసరికి వాళ్ళంతా కలిసి కొత్త బిచ్చగాళ్ళతో కలియబడ్డారు.

"ఏటి సేత్తాం మా కొట్లన్ని మీసీసారు- మేమూ కూలీవోళ్ళమే" అన్నారెవరో.

'పొండి పొండి' అదరిచింది ఓ పాతికేళ్ళ అమ్మాయి- చూట్టానికి పిచ్చెక్కిన మనిషిలావుంది- కాసేపటికి కొత్తవాళ్ళంతా పెద్దబజారుకేసి గుంపుగా నడిచారు.

*　　　*　　　*

స్టేషన్ అంతా రద్దీగా వుంది.

'ఏటవుద్దో' అంటూ ఓ చోట కూలబడ్డారు.

'ఏటవుద్ది- గెంటేస్తే దిగిపోవడమే' అన్నాడు కిష్టిబాబు- "ఏటో కలో గెంజో తాగి తొంగోవాల- మనూర్లో మనకేటి పాతివుందో సూడాల" అన్నాడో ముసిలతను.

కాసేపటికి వచ్చిన ట్రెయిన్‌లో ఓ బోగీనిండా టిక్కెట్లు కొనని వాళ్ళంతా తొందర తొందరగా నిండిపోయారు.

*　　　*　　　*

సుందర్రావుకి పేరయితే పెట్టారుగానీ అతను అందంగా ఉండడు- అదీకాక యాభయ్ ఏళ్ళు దాటిపోయిన తర్వాత అందం ప్రసక్తి అతనికీ రాలేదు- ఎమ్మెల్లే అయిన తర్వాత ఇలాంటివన్ని మర్చిపోయాడు అతను.

ఈమధ్య కొన్ని రోజులుగా బొత్తిగా చిరాగ్గా వుంటోంది అతనికి.

మొన్న మొన్న ముఖ్యమంత్రితో పెద్ద గొడవయింది- దాంతో ఈ పెద్దబజారు గొడవంటే కోపంగా వుంది- చంద్రశేఖరంగారూ వాళ్ళూ వచ్చి గంటలు గంటలు దీర్ఘంగా గొడవ చెప్పారు- గవర్నమెంటు వాళ్ళకి బొత్తిగా ప్రజల శాంతి భద్రతల గురించి పట్టింపు లేదన్నారు- ఇట్లా అయితే సుందర్రావు లాంటి వాళ్ళని ఎన్నికల్లో

గెలిపించి 'మాకు' ప్రియోజనం ఏమిటన్నారు- అయితే ఏం చెయ్యమంటారంటే అసెంబ్లీలో మీరంతా చేతులుముడ్చుకొని కూర్చుంటే మేం చిప్ప పట్టుకోవాల్సి వస్తుంది అని తేల్చారు.

దాంతో అసెంబ్లీలో పెద్ద దుమారంలేపాలని అనుకొన్నాడు సుందర్రావు- వున్న కొద్దిపాటి అపొజిషన్ వాళ్ళతో కలిసి ఎట్లా అయితే ప్రిశ్నలతో వేధించాడు.

"మేం ఏమి గుడ్డివాళ్ళం కాదు" అన్నాడు ముఖ్యమంత్రి.

"మరయితే జనాలందర్నీ ఎందుకిలా ఏడ్పించటం?" అని సుందర్రావు అన్నాడు.

"ప్రితి దానికీ గవర్నమెంటు జోక్యం అంత మంచిది కాదు- అయినా కూలీ వాళ్ళూ, షాపు ఓనర్లూ ఒప్పందాలు కుదరక షాపులు మూసుకొని కూర్చుంటే మధ్యలో మేం ఎందుకు దూరాలి?" అన్నాడు ముఖ్యమంత్రి.

దాంతో అసెంబ్లీలో తేలేది ఏమి లేదనుకొన్నాడు సుందర్రావు.

అందుకే రెండు రోజుల క్రితం బజారు వెళ్ళి స్వయంగా చూశాడు.

మళ్ళీ ఇవాళ సాయంత్రం.

అతనక్కడికి వెళ్ళేసరికి- దూరంగా ఫాక్టరీలు వదిలేపొగా, గాల్లో దుమ్మూ అంతా కలిసి చీకటిలేకపోయినా వెల్తురు అట్టే లేనట్లు కన్పిస్తోంది.

కొట్లన్నీ కట్టేసివున్నాయి- కొందరు మాత్రం ఆఫీసులు తెర్చుకొని కూర్చున్నారు గానీ పని మాత్రిం ఏమీ జరగటం లేదు.

అక్కడ స్టేజీ అదీ కట్టివుంది- మైకులో గోలగోలగా వుంది.

కూలీవాళ్ళు చాలమందే వున్నారు.

సుందర్రావు పెద్ద ఉపన్యాసమే ఇచ్చాడు- దాని సారాంశం అంతా కలిపి గవర్నమెంటు సరిగా ఈ విషయాన్ని పరిశీలించటం లేదని. కూలీవాళ్ళు దౌర్జన్యాలు జరపకుండా ఓనర్లతో సహకరించటం మంచిదని. కూలివాళ్ళకు కూలి డబ్బులు పోవటంమీద అతను చాలా ఆందోళన చూపించాడు.

"కొట్టు వాళ్ళేం మీ విరోధులు కారు- ఒక్కటుంబంలా వుండాల్సిన మనుషులంతా కొట్టుకుని కూర్చుంటే వుంటే దేశం ఏం ముందుకి వెళ్తుంది? అదీకాక చంద్రశేఖరంగారు అనేదేమిటంటే కూలి రేట్లు పెంచుతామని వాళ్ళు మీతో అన్నాకూడా మీరే సహకరించటం లేదని."

"చస్, అదంతా బూటకం" అని అరుపు వినిపించింది. దాంతర్వాత గోలగోల అయింది. సుందర్రావు రాళ్ళు పడకముందే స్టేజీ దిగి వెళ్ళిపోయాడు.

చిట్టికి ఎదురుగావున్న మనిషికి నలభై ఐదేళ్ళుంటాయి- కొంచెం లావుగా వున్నాడాయన- మనిషి నలుపు కిందకే వస్తాడు- బట్టలు మాసిపోయి వున్నాయి. ఆయన చాల మెదువుగా అన్నాడు.

"మనుషులు బతకటానికి ఒకోసారి ఆకలి చావులూ, ఇట్లాంటి విపరీత పరిస్థితులూ తప్పవు" అని.

"ఏటి సేద్దామన్నా కుదరకున్నది- రంగసామి ఉలకడూ పలకడు" అన్నాడు చిట్టి.

"తొందర పడమాకు" అన్నాడాయన.

కాసేపు ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

సముద్రం వొడ్డున సముద్రంపేసే మోత చేవుల్లో గీ పెడుతోంది- దూరంగా సముద్ర వొడ్డున్నవున్న ఓ చిన్న హోటల్లో లైటుకాంతులు- కొద్ది దూరంలోవున్న ఓ దేవుడిగుడి.

ఆయనే మళ్ళీ అన్నాడు.

"చూడు చిట్టీ, బతుకులో ఒకోమారు 'ఇది ఘోరం' అని తెలిసీ మనం కొంత కాలం వరకూ ఏమీ చెయ్యలేకుండా వుండిపోవాల్సొస్తోంది- ప్రజలు చచ్చిపోతూనే వుంటారు- వాళ్ళకోసం మనుషులూ రక్తాలు ధారపోస్తున్నారు- అయినాసరే ఇంకా న్యాయం రాలేదంటే- ప్రజల రక్తాన్ని ఇంకా అమ్ముతూనే ఉన్నవాళ్ళున్నారు- రంగసామి చేసేదీ అంతే- నాలుగ్గలాసుల రక్తంతాగే ఓనర్ని మావాళ్ళ రక్తం రెండు గళాసులే తాగు అంటున్నాడు- నాలుగ్గలాసులూ ఒకేసారి తాగేస్తే, మనిషి మిగల్డు అని తెల్సినవాళ్ళు వప్పుకోంటున్నారు."

"అ లంజి కొళ్ల పాతేస్తే సరి" అన్నాడు చిట్టి.

"ఆ తొందరే పడొద్దు. దాని మూలంగా విరోధాలు పెంచుకోటం తప్పించి వొంగేది లేదు. మనం రాజీకి దిగకుండా ఎంతకాలం దీనిలో పనిచెయ్యగలం అన్నది చూసుకోవాల. మనుషులకు నిజాన్ని నిజంగా చెప్పటం, దిగిజారిపోయే ధైర్యాన్ని కూడ గట్టటం, ఏది ఏమయినా పనిచేసే వాణ్ణి పని చేసేవాడుగా వాళ్ళ రూలు ప్రకారం అయినా వప్పుకోనేలా చెయ్యాలి. జనం సముద్రంలా మీద పడితే భూమి మునిగి పోతుంది గానీ తేలదు." అన్నాడు.

ఆ తర్వాత వాళ్ళిద్దరూ చాలాసేపు కూర్చున్నారు.

చిట్టి ముందు లేచి వస్తానని శెలవు తీసుకొన్నాడు, అతనికి పూరంతా తిరగా లనిపించింది. కూలి వాళ్ళంతా పూరంతా చెల్లా చెదరుగా అయిపోయారు. కొందరు రిక్షాల్లాగుతోంటే, కొందరు రాళ్ళు కొడుతున్నారు, కొందరు స్టేషన్ కాడ సామానులు మోస్తున్నారు. కొందరు అడుక్కొంటున్నారు. అతను రోడ్లు తిరుగుతూ చివరికి స్టేషన్ చేరుకొన్నాడు.

* * *

అప్పల్రాజు ప్లాట్ ఫారం మీద నేల మీద కూర్చుని అదే పనిగా వచ్చేపోయే రైళ్ళను చూస్తూ కూర్చున్నాడు. అతనికి ఏడుపు వస్తోంది. ఇంట్లో గుంట వెధవలు ఏంతింటున్నారో ఏం చేస్తున్నారో అని అతనికి బెంగపట్టుకొంటోంది యీ మధ్య. ఈ బజారు మూసేసే ముందు వరకూ అతను పూరికి డబ్బులు పంపిస్తూండే వాడు. వచ్చే దాంట్లో సగం పంపించేసి మిగతా సగం ఖర్చు పెట్టుకొనేవాడు. ఎప్పుడో సంవత్సరానికీ అలాగ పూరెళ్ళే వాడు.

"నానూ పట్నం వొస్తాను మావాఁ" అని సూకాలు అన్నప్పుడల్లా—

"ఇప్పుడేటి లేవే పిల్లా, కొంత కాలవాగు" అనేవాడు పెళ్ళాంతో— ఆ వున్న కొద్ది రోజులే అతనికి పెళ్ళాంతో బతుకు.

అక్కడ వాళ్ళకీ అంత బాపుండేది కాదు— ఏదయినా అయితే ఎవరూలేరు— కాపోతే అప్పల్రాజుకి పట్నంలో సర్దుకుపోటం కష్టమవుతుందని వాళ్ళనలానే వుంచే సాడు— రెండుమార్లు పుట్టిన పిల్లలు పుట్టిన నెలకీ రెండు నెల్లకీ చచ్చిపోతే పెళ్ళాడు— అలాంటప్పుడు సూకాల్ని పట్నం తీసుకొచ్చేద్దామనుకొన్నాడు గానీ ఆ పని చెయ్యలేదు.

'ఏటి సెయ్యాల?' అదే అతనికి బోధపడటంలేదు— 'ఆ పూర్లో నేటుంది?' 'కానేటి సెయ్యాల యీడ ఏటుంది బుగ్గి.'

వచ్చేపోయే రైలు చూస్తూ తటపటాయిస్తున్నాడు అప్పల్రాజు.

'ఒరేయ్ అప్పిగా' అని కేక విన్పించి వులిక్కిపడ్డాడు.

చిట్టి మెల్లిగా నడ్చుకొంటూ వచ్చి అప్పల్రాజు భుజం మీద చెయ్యి వేసి కూర్చుంటూ, "ఏటి బేరం దొరక లేదేటి?" అన్నాడు.

అప్పల్రాజు కళ్ళల్లోంచి వస్తున్న నీళ్ళచూస్తూ, "ఏటిరా ఏటయింది" అన్నాడు.

"ఏటీ నేదురా— పెళ్ళాన్నీ పిల్లల్నీ ఒగ్గేసి ఏటీ పాడు బతుకనిపిస్తోంది."

చిట్టికి కళ్ళంబట నీళ్ళొచ్చాయి– అప్పల్రాజు అనటమేగానీ పెళ్ళాన్ని ఎప్పుడూ తీసుకురాలేదు– మనుషులు నిర్జీవంగా యంత్రాల్లా పన్చేయటం అతనికి బాధ కల్గించింది గానీ, 'ఆరోజు దాకా తప్పదు' అనుకొన్నాడు.

అతనికి లీలగా ఎక్కడో ఆకాశంలో రక్తం ఛాయలు ఎర్రగా కన్పించి నట్లు అన్పించింది. ఆ రక్తపురంగు ప్రపంచమంతా కనబడుతుందని అతను అనుకొన్నాడు. ఆ ఎర్ర రక్తం ఛాయలు దిగివచ్చి మనుషుల రక్తంలో కల్సిపోయిన్నాడుగానీ ఇవన్నీ తప్పవు– అనుకొన్నాడు.

"మనిషి రగతం, ఎర్రని జెండారంగూ ఒకటే కదరా" అన్నాడు అప్పల్రాజుతో.

"ఏటీ–" అన్నాడు అప్పల్రాజు అర్థంకాక.

"పద పద–" అన్నాడు చిట్టి లేస్తూ.

* * *

చిట్టి ఎప్పుడో చిన్నప్పుడు రోడ్డుమీద పడివుండేవాడు– కొంతకాలంకి బజారు చుట్టుపట్ల తిరిగాడు– అప్పట్లో టీనీళ్ళు అందించటం దగ్గిర్నుంచి నేల వూడవటం దగ్గిర్నుంచి అన్నిరకాల పనులు చేసేవాడు– అతనున్న షాపుఓనరు మంచివాడవడంతో కొంతకాలంకి పని ఇచ్చాడు.

అతను పనిచేసే షాపులోనే గుమస్తా వుండేవాడు– అతను సన్నగా పొడవుగా, కళ్ళజోడు పెట్టుకొని మనిషి బాగా నీరసంగా వుండేవాడు– సిగరెట్లు తాగుతూ, అప్పుడప్పుడూ దగ్గుతుండేవాడు– షాపూ, గోడవునూ అన్నీ చీకటిగా వున్నట్లుండేవి– లోపల వున్న మనుషులకు గాలిగానీ, వెల్తురుగానీ వుండేది కాదు– ఆ చీకటి గదిలో అతను కూర్చుని పుస్తకాల్లో పద్దులు రాస్తుండేవాడు– అక్షరాలు కన్పించక కాయితాలను కళ్ళకు దగ్గిరగా పెట్టుకు చూసేవాడు. అతనే చిట్టిని ఒకసారి అడిగాడు–

"నీకు చదువొచ్చా?" అని.

"నాకేటొస్తుంది?" అన్నాడు చిట్టి– ఆ గుమాస్తా ముఖంలో ఎందుకో చిన్న చిరుకాంతి లాంటిది కన్పించింది– "నేన్నేర్పుతా" అన్నాడు– చిట్టికి ముందు అర్థం కాలేదు– ఆ తర్వాత రాత్రిళ్ళు చాలసేపు ఉండిపోయాడతను– మెల్లిమెల్లిగా కొద్దిగా చదవటం, రాయటం నేర్చుకొన్నాడు చిట్టి.

చాలాఏళ్ళ క్రితం ఓ సంఘటన జరిగింది– అది ఇప్పటికీ చిట్టికి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా కడుపులో తిప్పుతూంది.

— (మిగతా 67 వ పేజీలో)

# సాంఘిక పరియోజనానికి దూరంగా విసిరివేయబడ్డ 'కమలనయన్'

జైరామ్

లైంగిక వాంఛల్తో కాగిపొయ్యే స్త్రీ ముఖచిత్రంతో వెలువడిన ఈ సంకలనంలో వివిధ పత్రికలలో ఇదివరకే ప్రచురింపబడిన 11 కథలు వున్నాయి- కథనంతో బాటు పాత్రల మనోవిశ్లేషణ కూడా రచయిత చేశాడు.

విపరీత మనస్తత్వం, లైంగిక వాంఛ. Impotency, శీఘ్ర స్ఖలనం, Homosexual, Sex perversion — వీటితో మొదలయ్యే సమస్యల్ని ఇతివృత్తాలుగా చేసుకొని ప్రధానంగా చిత్రించాడు రచయిత.

విపరీత మనస్తత్వం, అక్రమ లైంగిక వాంఛ, అనుమానం, నిర్దాక్షిణ్యత, స్వచ్ఛందతారాహిత్యం వర్గసమాజ వికృతరూపాలే. తరతరాలుగా మారుతూవస్తున్న ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవన విధానం ప్రభావం కుటుంబ వ్యవస్థ, స్త్రీ పురుష సంబంధాలు, కట్టుబాట్లు, సంప్రదాయం, ఆచారవ్యవహారాలపై వుంటుంది. పునాదిని వదిలిపెట్టి ఉపరితల నిర్మాణంతో ఎంత పోరాటం చేసినా పునాది కూలనిదే ఉపరితల నిర్మాణం బ్రద్దలుకాదు- సాంఘిక పునాది మారినా గత వ్యవస్థల అవశేషాలు ఉపరితల నిర్మాణాన్ని పాలిస్తూంటాయి- సంస్కృతికి సంబంధించి గణవ్యవస్థ అవశేషాలా ఫ్యూడల్ వ్యవస్థలోనూ ఆ రెండింటి అవశేషాలు పెట్టుబడిదారి వ్యవస్థలోనూ, ఈ మూడింటి అవశేషాలు సోషలిస్టు వ్యవస్థలోనూ మానవుల జీవితాల్ని పాలిస్తూంటాయి కాస్త తక్కువ ఎక్కువ మోతాదుల్లో. పితృస్వామ్య వ్యవస్థ ఏర్పాటుచేసిన నైతిక విలువలు, లైంగిక స్వేచ్ఛ ధార్మిక సూత్రాలు మగవాడికి వున్నంత అనుకూలంగా సౌలభ్యంగా స్త్రీకి లేవు. స్త్రీ తన వాంఛల్ని స్వేచ్ఛగా తీర్చుకోడానికి సమాజంలో నైతిక విలువలు, కుటుంబ వ్యవస్థ, పెళ్ళి వ్యవస్థ, పతివ్రతాధర్మం పురుషుడు ఏర్పాటుచేసి నీతినియమాలు అడ్డువస్తున్నాయి.

ఇందులో కథకుడూ విమర్శకుడు రెండూ చేసుకున్న కథలున్నాయి- రచయిత కథ మధ్యకు వచ్చి వ్యాఖ్యానిస్తాడు- కలలు ప్రవేశపెట్టి మనోవిశ్లేషణ చేశాడు.

'మోహమూ - మైత్రి' కథలో శారీరక వాంఛలు తీరని అరుంధతి భర్త impotency కారణంగా రాజుపై వ్యామోహం పెంచుకుని తన కోరికల్ని తీర్చుకోవాలనుకుంటుంది. సామాజిక నియమాలకు, నీతి సూత్రాలకు, పతివ్రతా ధర్మానికి ఇష్టంలేకపోయినా కట్టుబడాల్సిన పరిస్థితివున్న వ్యవస్థలో కోరికలు తీర్చుకోలేక రాజుకి

మరో స్త్రీతో పొందు సహించలేక కసి, ద్వేషం, అసూయతో, తీరని కోరికలతో ఆత్మహత్యకు పూనుకుని భర్త చేత రాజు శోభనానికి పూలు పంపిస్తూ రాజుని పిలుచుకు రమ్మని ఉరి వేసుకుంటుంది- కోర్కెలతో సతమతమయ్యే స్త్రీకి ఆత్మహత్య పరిష్కార మార్గంగా చూపెట్టాడు.

తండ్రితో లైంగిక సంబంధం (స్వయాన తల్లి నోటిద్వారా) అంటగట్టబడిన ఒక కూతురి కథ 'భవాని'. ఆ తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు- ఆ కూతుర్ని ఆత్మహత్య రహదారిలో వదులుతాడు అదే పరిష్కార మార్గంగా. తండ్రికి అంట గట్టబడిన సంబంధాన్ని జనం నమ్ముతారు, నమ్మటంలో సుఖం కనిపిస్తోంది అన్నమాట నిజమే (ఆటవిక దశ అవశేషానికి నిదర్శనం).

భవానిని పెళ్ళి చూపులు చూడ్డానికి వచ్చిన అతనిచేత కట్నంపై ఒక గొప్ప అభిప్రాయం పలికించాడు,

"కట్నాలు తీసుకోకూడదని ఈ ఆడరచయితలు వీళ్ళంతా ఇంత గొడవచేస్తా రెందుకో నా కర్థంకావడంలేదండీ. తీసుకొన్న కట్నాన్ని మగవాడొక్కడే అనుభవించటం లేదుకదా. సంసారమన్నాక కష్టసుఖా లెట్లాగో ఆస్తికూడా అంతే. ఇద్దరి సొత్తునూ ఇద్దరూ అనుభవిస్తారు పిల్లల్తోపాటు- కాని వీళ్ళ ఇంకో థియరీ ప్రకారం స్త్రీకి తండ్రి ఆస్తిలో భాగంకావాలి- ఇప్పుడు కట్నాన్ని చూపి పిల్లనివ్వటానికి తల్లిదండ్రులు ఎలా ముందుకు వస్తున్నారో అట్లాగే అప్పుడు స్త్రీకి వచ్చే ఆస్తివాటాని బట్టి ఆమెను చేసుకోవటానికి ముందుకు వస్తారు- స్త్రీకి తన తండ్రి నుండి సంక్రమించిన ఆస్తి మీద ఆమెకు దొరికే భర్త స్థితిగతులు ఆధారపడివుంటాయి- కట్నాలు లేనంతమాత్రాన ఒక ధనికుడి బిడ్డడు ఒక పేదవాని కూతుర్ని చేసుకోడుగదా."

దీనికల్లా ఒక్కటే రెమిడీ "ఆస్తిని జాతీయం చేయటం".

ఈ కథలోనే మానవ నాగరికత గురించి వ్యాఖ్యానిస్తూ రచయిత ఫాష్ హోట ల్లోని ఆటవిక నృత్యాలు, పాశ్చాత్య నాటకాల్లోని కామక్రీడా ప్రదర్శనలు, హిప్పీ కల్చర్, రోజు రోజుకూ మారుతున్న వస్త్రధారణ గురించి పేర్కొంటూ మానవ నాగరికత మొదట బయలుదేరిన బిందువు వద్దకు చేరుకోబోతుందా? అని నిరాశను వెలిబుచ్చాడు- ఇది వ్యాపార సంస్కృతి అనీ, దీనికి మూలం సామ్రాజ్యవాదమనీ ఇది దోపిడీవర్గాలకు వుపయోగపడుతుందనీ రాజకీయ, ఆర్థిక పునాదిని స్పృశించి వ్యాఖ్యా నించలేక పొయ్యాడు- దాన్ని కూల్చాల్సిన అవసరాన్ని గుర్తించలేకపొయ్యాడు.

ఫ్రాయిడ్ 'లిబిడో'_Girl-Attachment to father from her childhood సూత్రీకరణల్ని సాంఘిక పరిణామ క్రమంలో కుటుంబ వ్యవస్థ, ధర్మం, సంప్రదాయం, మానవులమధ్య సంబంధాలు, స్త్రీపురుష అనుబంధాలు, నైతిక సూత్రాలు అధిగమించాయి_ ఎక్కడోగాని 'భవాని' కథలో మాదిరి జరగవు.

'సుబ్రమణ్యం' కథలో మొదటినుంచీరా పురుషాధిపత్యంపై రచయితకున్న మోజును వెలిబుచ్చుతుంది_ తల్లి గారాబం చేత పెరిగి, తండ్రి నిర్లక్ష్యానికి గురవుతూ, తాను ప్రేమించిన స్త్రీ తనకు దక్కకుండా తన ఇంట్లోనే అన్న భార్యగా తన కళ్ళెదుట తిరుగుతూండటం, తన భార్యను అన్న మోడల్‌గ నిలబెట్టి బొమ్మగీయటం లోకమంతా తనను హేళన చేస్తున్నట్లు వేదన ననుభవిస్తూ ఆఖరుకి తనకి కాకుండా పోయిన తన ప్రేమ వస్తువుపై కసి, అన్నపై కసి, అవమానం, వేదన అన్నీ పెనవేసుకొని భరించలేని కోపంతో ప్రతీకారం తీర్చుకోవాలని శకుంతలను వికారంచేసి, అన్నపై హత్యా ప్రయత్నం చేస్తాడు సుబ్రమణ్యం. సుబ్రమణ్యం మానసిక స్థితిని రచయిత వ్యాఖ్యానిస్తూ 'పారనోయా' వ్యాధిగ్రస్తునిగా చిత్రీకరించాడు.

మనస్తత్వ శాస్త్రరీత్యా సుబ్రమణ్యాన్ని 'పర్ సెక్యూటరీ పారనోయాక్' అనవచ్చు.

"In persecutary paranoia the sufeer takes a particular way of defending himself against an unduly strong homosexual attachment to a given person, with the result that the person he once loved most is changed into a persecutor and then becomes the object of aggressive and often dangerous impulses on the past of the patient."

Here we have grounds for interposing an intermediate phase in which the love is transformed into hate.

సుబ్రమణ్యానికి హోమోసెక్సువాలిటీ వున్నట్లు కథలో నిదర్శనాలు లేవుగాని. ప్రేమ ద్వేషంగా మారడం, వ్యక్తిని భయంకర పరిస్థితులవైపు స్పందించేటట్లు చెయ్యడం వుంది.

సుబ్రమణ్యం అన్న గీసిన బొమ్మల ప్రదర్శనం చూసి శకుంతల అతన్ని మోహించటానికీ, అతనిపై మనస్సుతో సుబ్రమణ్యాన్ని సాధనం చేసుకోవటానికీ, ఒకే ఇంట్లో వుండాల్సిరావటానికీ, అన్న అతని భార్యను 'మోడల్'గ పెట్టి చిత్రం గీయటానికీ దగ్గర దగ్గరగా ఒకేచోట తిరగాల్సి రావడం, సుబ్రమణ్యంలో కసిపెరిగి వేదన రగిలి హత్యా ప్రయత్నానికి దారి తీసేట్లు చెయ్యటానికి కావల్సిన పరిస్థితులు

సామ్రాజ్యవాద ప్రభావంతో నేటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవన విధానంలో మిళితమైన వ్యాపార సంస్కృతిలో వున్నాయి.

విద్యావంతులైన ఇద్దరు స్త్రీల మధ్య జరిగే హోమోసెక్సును సస్పెన్స్‌లో పెట్టి పెళ్ళికి ఇష్టపడని స్త్రీ గురించి చెప్పిన కథ 'అనాసక్త'. పురుషాధిపత్యాన్ని ధిక్కరించే స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమానత్వాన్ని హేళనచేస్తూ స్వేచ్ఛ కోరడానికి కారణం వికృత లైంగిక వాంఛ, తృప్తి లభించని సంసార స్త్రీలో, ఎన్నాళ్ళకీ పెళ్ళిళ్ళు కాక శారీరకంగా జీతించిపోయిన వయస్సు మీరిన కన్యలో ఆ రకమైన వుపన్యాసాలు ఇస్తుంటారని చిత్రీకరించి సామాజిక ద్వంద్వ నీతిని గ్రహించకుండా స్త్రీని కించపరిచే కథ ఇది.

అన్నపానీయాదులు వదలి రోజుల తరబడి 'సరస్వతీ పటం' ముందు కూర్చొని కళను ఆస్వాదించే ఒక మూర్ఖుడు, ఒక సోమరిపోతు నరేంద్రని సృష్టించాడు 'సరస్వతీ పటం' కథలో. తిండి అనేది లౌకిక బాధ అతనికి. అన్నీ తెలిసి దానికి అతీతుడు. ఇతనికి లౌకిక జీవితంలో బతికే మనుషులు వక్తిత్వంలేని మనుషులు. ఇతను పెళ్ళానికి కూడా అతీతుడే. సరస్వతీ పటంలో లైంగిక కార్యకలాపాలు మొదలుపెట్టి ఆఖరికి ఈ మూర్ఖుడు భార్యను హత్యచేసి తాను ఆత్మహత్య చేసుకుంటాడు. ఎవరి ఊహలకీ అందని ఈ కళాభోగి కంఠంనేని కళాత్మక ఊహలకి అందడం తెలుగు పాఠకుల దురదృష్టం– పైగా కథ చివర్లో ఒక స్టేట్‌మెంట్‌తో ముగిస్తాడు– మనం కలలో కూడా ఊహించని విషయాలు స్వర్గంలోనూ భూమిలోనూ చాలావున్నాయి అంటూ. కథకుని స్వీయ మానసిక ధోరణిలో ఉత్పన్నమయ్యే ఇలాంటి అభూతకల్పనలు నమ్మించాలనే ప్రియత్నం సరస్వతీ సంభోగంకన్న హీనమైన పాపం. ఇది ఒక Waste product.

ఆల్బంలోని తల్లి యవ్వనపు బొమ్మని ఊహించుకుని కలలుగనే ఒక జీవికథ 'కమలనయన్'. తల్లి బొమ్మని ఊహిస్తూ 'ఆమె'తో ప్రణయ కలాపాలు సాగిండడం పాఠకుల్ని సస్పెన్స్‌లో పెట్టడంకోసం పడిన తంటాలే. రచయితపై డిటెక్టివ్ సాహిత్య ప్రభావం వుంది. 'సమాజంలో మానవుడి జీవితం ఒక చెకపట్టీ ఆట, ఎవరికి వారి నేర్పరితనాన్నిబట్టి, చురుకును బట్టి విజయాలు' అంటూ సాంఘిక పునాది నుండి విడివడి వ్యక్తివాదాన్ని సమర్థిస్తాడు.

'ఏ థింగ్ ఆఫ్ బ్యూటీ' లోని విశాలక్షి ఒక సౌందర్యారాధకురాలు. సౌందర్య పిపాసతో విశాలాక్షిని లేచి పొయ్యేటట్లు చేసి ఆఖరుకి కుష్టురోగిగా భిక్షగత్తెగా చిత్రీకరి

స్తాడు. ఈ కథలో కూడా రచయితకున్న స్త్రీ ద్వేషం స్పష్టంగా తెలుస్తోంది. తనలోని స్త్రీ ద్వేషం, స్త్రీ పట్ల చిన్న చూపుకి నిదర్శనమే ఈ పాత్ర సృష్టి. ఇది కూడా ఒక చెత్త కథ.

'ప్రాచ్య సీసాలో పాశ్చాత్య సారాయి'లో జాతీయ దురహంకారం కన్పిస్తోంది. స్వదేశ సంస్కృతి స్వచ్ఛమైనదని విదేశీ సంస్కృతి అంతా నాసిరకం అనీ అక్కడ అభిమానం, నీతి, దయ, పరస్పర సహకారం వుండవనీ తన దేశంలో అవి పుట్టిపడ తాయనీ భావించే జాతీయ వాదమే ఇది. "సంఘపు సమూహ శ్రేయస్సుకంటె వ్యక్తి గత స్వార్థం ముఖ్యమనే పాశ్చాత్యవాదాన్ని వంటబట్టించుకున్నాడు" అనే మాటలతో అది రుజువవుతుంది. ప్రాచ్యదేశాల్లో సమూహ శ్రేయస్సు కోరుతున్నట్లు స్వార్థం లేనట్లు పాశ్చాత్యదేశాల్లో స్వార్థం వున్నట్లు. ఇందులో నరేంద్రప్రసాద్ ప్రవర్తన అంతా పాశ్చాత్య Philosophy గా చెపుతాడు. అవునుమరి అడుక్కు తినే వాండ్లని సృష్టించి దానధర్మాలుచేసే పుణ్యాత్ముల, బీదాబిక్కికి అన్నదానాలుచేసే ధర్మాత్ముల దేశంకదా మనది.

ఆఖరిలో నరేంద్ర, భార్య హీనకులస్తుడితో లేచిపొయ్యిందని విచారిస్తే అపు డంటాడు సీసా ప్రాచ్యమే అని. అంటే పాశ్చాత్య ఫిలాసఫీలో కులబుద్ధి లేదనా? అక్కడ లేచిపోవడం సర్వసాధారణమనా? విందుకు పిలిపించి నరేంద్ర సగ్నప్రద ర్శన చెయ్యడం డబ్బుకోసం గడ్డితినే వాళ్ళపై నరేంద్ర పాత్రద్వారా విసిరిన కొరడా దెబ్బలు బాగున్నాయి.

యవ్వనపు పొంగు తగ్గినా కోరికల కతితంగాని సాహసంచేసి మగవాడి పిలుపు నందుకొని నీతినియమాల నుల్లంఘించి ముందుకుపోలేకపోయిన ఒక స్త్రీకథ 'వాల్‌క్లాక్' పరువు, ప్రతిష్ఠ, వంశగౌరవం, సంప్రదాయాలకు కట్టుబడి కోరిక చెలరేగినా తీర్చుకో లేని ఒకస్త్రీ తపన ఇందులో చక్కగా చిత్రించారు. లైంగిక వాంఛలు స్వేచ్ఛగా తీర్చు కోలేని స్త్రీలకి ప్రతిబింబం ఈ కథ. సుభద్రాదేవి తాళంకప్పను గడియారానికి విస రడం తనలోని కోర్కెను బలవంతాన బిగపట్టి కూలబడడంతో కథకుడి పతివ్రతా ధర్మం యథాతథంగా నిలిచింది.

తనకు పిల్లలులేరు గాబట్టి, అయ్యే అవకాశం ఇక లేదుగాబట్టి తన దగ్గరి వారికి కూడా లేకుంటే బాగుంటుంది అనే మానవ అంతరంగంలోని ఒక అసూయాజ్వాలను గుప్తంగా చిత్రీకరించటం జరిగింది 'ఇష్టంలేని ఇష్టం' కథలో. ఇలాంటి ఆలోచనకు,

అసూయకు, నర్మగర్భమైన జ్ఞాతివైరానికి వర్గ సమాజంలోని ఎత్తిపొడుపులు, తక్కువగా చూడడం కారణాలు గావచ్చు.

స్త్రీలో వాంఛల్ని రేకెత్తించి పూర్తిగా సంతృప్తి పరచలేకపోయే శీఘ్ర స్ఖలనుల గురించి చెప్పబడిన కథ 'పద్మావతి మొగుడు'. ఇంటింటికీ తిరిగి లైంగిక సంభాషణల్తో సంతృప్తిపొందే మధ్యతరగతి గృహిణుల కథ ఇది. గయ్యాళితనం వున్న పద్మావతిలాంటి స్త్రీలు భర్త లోపాల్ని ఆసరాగ చేసుకొని సూటిపోటి మాటలతో వారిని హెన్‌పెక్‌డ్ హజ్‌బెండ్‌లుగ మార్చుకుంటారు.

రచయితలో Aesthetic sense ఎక్కువగా వుంది. ప్రకృతి దృశ్యాలు, కొలను నీళ్ళు, తామరలు, హంసలు, వెన్నెల, చల్లగాలి, పచ్చిక, పాలరాతి భవనాలు, తెల్లటి దుస్తులు, గలగలపారే సెలయేరు- వర్ణనలు అద్భుతంగా చిత్రించాడు.

కథకునిపై సినిమా డైలాగుల ప్రభావం వుంది. 'కొరికివేయ బడ్డట్లున్న చందమామ, పెదాలకు రెండు వైపులా మాంసపు ఇడ్డెన్లు అంటించటం' లాంటి వికృతోపమానాలు సర్రియలిజం ప్రభావమే.

కథకుని Imagery చూడండి. 'అనాసక్త'లో ఆడదాని ఒంటిమీద చెయ్యేసి వెన్నెలలో ఎదురెదురుగ నిలుచున్న మగవాడికి కలిగే భావాలు 'మా చుట్టూ ఏదో మిస్టరీతో కూడుకున్న పొగ దట్టంగా ఆవరిస్తోంది- దూరాన్నుంచి కిన్నెరల గానం వినిపిస్తోంది- దివ్యాభరణాలు ధరించిన దేవతా జంటలు పొగల కావల పొదల మధ్య రహస్యంగా విహరించటం, ఎక్కడో దక్షిణ దేశపు ఆలయంలో రాజనర్తకి భరత నాట్యం చేస్తోంది లయబద్ధంగా'— ఫ్యూడల్ వాసనలు, ప్రబంధ కవుల అనుకరణ- ఆధ్యాత్మిక మనబడే భావవాద ఇమేజరీ.

భారతీయ ప్రాచీన ధర్మాలపైపే మొగ్గుచూపాడు గాని ఖండించ లేకపోయాడు- మన కుటుంబవ్యవస్థ, పెళ్ళిపద్ధతుల్లోని లోపాలను, ద్వంద్వనీతిని ఖండించలేకపోవడం ఏ మూల్లోనోవున్న మైనారిటీ అంశాల్ని చిత్రించడం, కోర్కెలతో సతమతమయ్యే స్త్రీకి ఆత్మహత్య పరిష్కార మార్గంగా చూపెట్టడం, కొన్ని కథల్లో అలాగే వదిలేసి యథాతథ స్థితికి ప్రాణంపోసే ప్రయత్నం చెయ్యడం, సమస్యల మూలాన్ని చూపెట్టి పునాదితోనూ ఉపరితల నిర్మాణంతోనూ పోరాటం చెయ్యకుండా వ్యక్తి మానసిక బల హీనతలు, శారీరక లోపాలను Expose చేసి కారణాలుగా చూపెట్టడం- జీవితంలో ఇలాంటివి గూడా వున్నాయి అని తెలుపడానికి తప్పిస్తే ఈ కథలద్వారా రాధాకృష్ణ మూర్తి సాధించే సాంఘిక ప్రయోజనం శూన్యం.

# విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?

విరసం ఎలా వుండాలి? అనే చర్చను 'సృజన' పత్రికలో చదువుతూనే వున్నాను- ఈ సందర్భంగా మీరిచ్చిన ప్రశ్నలకు జావాబులిచ్చే పద్ధతిలో నేను ప్రస్తుతం రాయదల్చుకోలేదు.

క్షమించరానంత ఆలస్యంగానే అయినా 'పిలుపు' ప్రచురణల వారు ముద్రించిన 'చైనా విప్లవం - సాంస్కృతిక ఉద్యమం' అనే వ్యాస సంకలనం ఈ మధ్యనే చదవటం జరిగింది. చైనా నూతన ప్రజాస్వామ్య విప్లవంలో భాగంగా సాగిన సాంస్కృతిక విప్లవానికి, ఈనాటి భారత జనతా ప్రజాతంత్ర విప్లవంలో భాగంగా సాగుతున్న సాంస్కృతిక విప్లవానికి ప్రధానమైన పోలికలున్న కారణాన వారి అనుభవాలు మనకు ఉపయోగపడ్తాయి. పై సంకలనంలోని 'నూతన ప్రజాస్వామ్య సంస్కృతి' అనే వ్యాసం ప్రతి విప్లవ కళాకారుడు అధ్యయనం చేయదగ్గది. ఆ వ్యాసంలోని ముఖ్యాంశాలను చర్చించటమే ఈ లేఖ వుద్దేశ్యం.

"సామ్రాజ్యవాద వ్యతిరేక - జమీందారీ విధాన వ్యతిరేక శ్రామికవర్గ నాయకత్వం గలిగిన ప్రజా సంస్కృతియే నూతన ప్రజాస్వామిక సంస్కృతి" అని వారు నిర్వచించారు.

"చైనాలో విప్లవ రాజకీయ రంగంలో మాదిరి సంస్కృతి రంగంలో కూడా ఐక్య సంఘటన కవకాశం వుంది" అని చెప్పి 1919 నుండి 1940 మధ్యకాలంలో రాజ

---

స్థూలంగా చూస్తే ఆర్థిక దోపిడీకి సంబంధం లేనట్లు కథల్ని సృష్టించడంలో నైపుణ్యం ప్రదర్శించాడు- కథల్లో వేగం సాధించాడు- కాని ఈ కథల్తో తనకున్న కళా నైపుణ్యాన్ని వేస్ట్ చేసుకున్నాడు కంఠంనేని.

దీన్ని విలక్షణ కథాసంపుటి అనడంకంటె అవలక్షణ కథాసంపుటి అంటే బాగుంటుంది- రచయితపై ఫ్రాయిడ్ ప్రభావం వుంది. ఫ్రాయిడ్ ప్రభావం వుండడం గొప్పదనమేమీ కాదు.

కథలకు ఫోటోగ్రఫించిన బొమ్మలు కథలకి తగినట్టు వున్నా అసహ్యకరంగా వున్నాయి- ముఖ్యంగా 'వాల్ క్లాక్' కథాచిత్రం. ఈ కథల్ని భార్యకి అంకిత మివ్వడంలో రచయిత వుద్దేశం అర్థం కాలేదు.

ఇది ప్రజావ్యతిరేక సాహిత్యం క్రిందికే వస్తుంది- ఇలాంటి కథల మత్తులో పడకుండా పాఠకుల్ని ప్రజా రచయితలు, విమర్శకులు కాపాడుకోవాలి.

కీయ ఐక్యసంఘటనలో వలెనే సాంస్కృతిక రంగంలో కూడా ఐక్యసంఘటన నాలుగు దశలుగా ఎలా సాగిందీ వివరించటం జరిగింది.

ఐక్య సంఘటన అంటే కార్మికవర్గ పార్టీ అయిన కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వాన కార్మిక వర్గేతరులు, ఆయా విప్లవ దశలలో కార్మికవర్గానికి మిత్రులైన అన్య వర్గాలను సంఘటిత పరచి ప్రధాన శత్రువుకి వ్యతిరేకంగా పోరాడటం. ఇదే సూత్రాన్ని సాంస్కృతిక రంగంలో కూడా అన్వయించుకోవాలి. సాంస్కృతిక విప్లవానికి నాయకత్వం వహించే వారికి (సాంస్కృతిక రంగంలో పనిచేసే కమ్యూనిస్ట్‌లకు) తమ రంగంలో ఐక్య సంఘటన ఎలా నిర్మించాలీ అనే స్పష్టత లేకపోతే సాంస్కృతికోద్యమాన్ని అభివృద్ధి చేయలేరు.

జనతా ప్రజాతంత్ర విప్లవానికీ, సోషలిస్ట్ విప్లవానికీ విడదీయరాని సంబంధం వుంది. అదే సమయంలో ఆ రెండింటి మధ్య తేడాని అర్థంచేసుకోలేకపోతే మనం గందరగోళ పడటానికి అవకాశం వుంది. ఈ విషయంపై ఆ వ్యాసంలో యిలావుంది.

"చైనా విప్లవం, ప్రపంచ శ్రామిక విప్లవంలో ఒకభాగమైనట్టే చైనా సంస్కృతీ విప్లవం ప్రపంచ సోషలిస్ట్ విప్లవ సంస్కృతీ ఉద్యమంలో ఒక భాగం, ఒక మిత్రమూనూ. అలా అన్నంత మాత్రంచేతనే చైనా సంస్కృతి సోషలస్ట్ సంస్కృతి కాబోదు. సామ్రాజ్యవాద వ్యతిరేక, జమీందారీ విధాన వ్యతిరేక నూతన ప్రజా సంస్కృతి మాత్రమే. చైనా విప్లవాన్ని శ్రామిక నాయకత్వాన్నుండి వేరుచేయలేము. అలాగే నేటి చైనా సంస్కృతి కూడా చైనా శ్రామిక విప్లవ నాయకత్వం క్రింద తప్ప పెంపొందలేదు. అంటే కమ్యూనిస్ట్ నాయకత్వం క్రిందతప్ప పెంపొందదు. అయితే ఈ నాయకత్వం నూతన ప్రజాస్వామ్య యుగంలో సామ్రాజ్యవాదానికీ జమీందారీ విధానానికీ వ్యతిరేకమైన ప్రజారాజకీయ సంస్కృతి విప్లవం యొక్క నాయకత్వమే కాని సోషలిస్ట్ దశలో వుండవలసిన రాజకీయ, సంస్కృతీ విప్లవ నాయకత్వం మాత్రం కాదు."

ఇంకా యిలా వుంది "మనం కమ్యూనిస్టు దృక్పథాన్ని సోషలిస్ట్ ఆశయాన్ని ప్రజలకు విశదపర్చటానికి, నూతన ప్రజాస్వామికాన్ని స్థాపించటానికీ వెన్వెంటనే ఆచరించ వలసిన కార్యక్రమానికీ భేదం తెలుసుకోవాలి. పరిశోధన, అధ్యయన, కార్యాచరణలలో కమ్యూనిస్టు పద్ధతికీ, నూతన ప్రజాస్వామికాన్ని స్థాపించుటకు అవసరమైన జాతీయ ప్రబోధ పద్ధతికీ భేదం గుర్తించాలి. ఈ రెండు పద్ధతులను కలగాపులగం చేయటం అంటే తప్పకుండా పొరపాటు పడటమే."

సాంస్కృతిక రంగంలో పనిచేసే కార్మికవర్గ శ్రేణులు (కమ్యూనిస్టులు) మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానానికనుగుణ్యమైన పరిశోధన, అధ్యయనము, కార్యాచరణ కలిగివుంటూ ప్రజా సాంస్కృతిక విప్లవ నాయకత్వం లాగానే వ్యవహరించాలి. ఆ రంగంలో కార్మికవర్గ శ్రేణులను (సోషలిస్టు చైతన్యంగల శక్తులను) అభివృద్ధి చేసుకోవాలి. ఇది కమ్యూనిస్టు పార్టీ నిథిగా అనుసరించవలసిన రహస్య పార్టీ నిర్మాణ పద్ధతుల ప్రకారం జరగాలి.

ఆ వ్యాసంలోనే నూతన ప్రజాస్వామిక ప్రభుత్వం ఎలా వుంటుందో కూడా వారు వివరించారు. "చైనా జాతియొక్క నూతన ప్రజాస్వామిక ప్రభుత్వ మహాసౌధం స్వరూపంలోనూ, స్వభావంలోనూ కూడా నూతన ప్రజాస్వామిక రాజకీయాలూ నూతన ప్రజాస్వామిక ఆర్థిక విధానమూ, నూతన ప్రజాస్వామిక సంస్కృతి-ఈ మూడింటి యొక్క కలయికయే. ఇలాంటి నూతన చైనానే మనం నిర్మించటానికి కృషి చేస్తున్నాం."

చైనా సాగించిన రాజకీయ, సాంస్కృతిక విప్లవంతో మౌలికంగా పోలివున్న భారత విప్లవానికి నాయకత్వం వహిస్తున్న శ్రామికవర్గ పార్టీ శ్రేణులు పైన పేర్కొన్న విషయాల్ని సాంస్కృతిక రంగానికి అన్వయించుకోవలసిన అవసరం ఈనాడెంతైనా వున్నదని నా అభిప్రాయం.

'విరసం' ఒక ప్రజా సాంస్కృతిక వేదికగా అభివృద్ధి చెందటానికి సాగిస్తున్న కృషిలో ఈ అంశాలను దృష్టిలో వుంచుకొంటుందని ఆశిస్తున్నాను.

సృజనలాంటి విప్లవ సాహితీ పత్రిక 'నూతన ప్రజాస్వామ్య సంస్కృతి' అనే చైనావారి వ్యాసంపైన చర్చావేదికను ఏర్పాటుచేయటం ఈ దశలో మనకెంతో అవసరమని కూడా నా అభిప్రాయం.

— జానకి

6-8-78 రాజమండ్రి

1 విరసం ఆవిర్భవించే నాటికి దేశంలో సాంఘిక ఆర్థిక రాజకీయ సమస్త రంగాల్లోను సంక్షోభం తీవ్రస్థాయిలో ఉంది. ఒకవైపు పాలకవర్గ పార్టీలు తమ వంచనా శిల్పంతో ప్రజలను జోకొడుతూ వక్రమార్గాలు పట్టిస్తున్నాయి. మరోప్రక్క దోపిడీని ప్రతిఘటిస్తున్న ప్రజలను నిర్బంధ చర్యలతో నిర్దాక్షిణ్యంగా అణచివేస్తున్నాయి. ప్రజల పేరుతో బ్రతుకుతున్న ప్రతిపక్ష రాజకీయ పార్టీలన్నీ ప్రజలను తమ తమ

పాక్షిక రాజకీయాలకు పావులుగా మాత్రమే వాడుకుంటున్నాయి- మరోపక్క పీడిత ప్రజల విముక్తికోసం శాస్త్రీయ సోషలిస్టు సమాజంకోసం కంకణం కట్టుకున్నామన్న కమ్యూనిష్టు ఉద్యమం రివిజనిజం ఊబిలో గొంతువరకు దిగబడిపోయి ప్రజాపోరాటాలను నీరుగారుస్తూ, పక్కదారి పట్టిస్తూ పాలక, దోపిడీ వర్గాలకు ఊడిగంచేస్తున్న దశ అది. సాహిత్య రంగం అందుకు భిన్నంగా ఏమీలేదు. రచయితలు, కళాకారులలో అధికభాగం తమ తమ తాత్కాలిక అల్ప ప్రయోజనాలకు తమ కలాలను గళాలను తాకట్టుపెట్టి బ్రతుకులు గడపడం అలవాటుగా మారిన కాలం అది. ఒకనాడు ప్రజా రచయితలకు వేదికగానున్న అ. ర. సం. అవకాశవాద కీర్తికండూతి రాయుళ్ళకు నిలయంగా తయారై జీవచ్ఛవంలా మూగవోయిన రోజులవి.

అయితే ఆ తరువాతి కాలంలో అనివార్యంగాను, అంతకంతకు ఉధృతంగాను దేశంలో చెలరేగిన వివిధ మిలిటెంట్ స్వభావాలుగల ప్రజా ప్రతిఘటనోద్యమాల కారణంగా దేశంలో నూతన సంచలనం బయలుదేరింది- రాజకీయంగా నూతన పరిస్థితుల కనుగుణంగా నూతన విప్లవ సైద్ధాంతిక భావాలు వ్యాప్తికావటం ప్రారంభమైంది. అయితే వాటికొక స్పష్టమైన, శాస్త్రీయమైన సిద్ధాంత పరిపక్వతగాని, ఒక నిర్ణీత నిర్మాణ స్వరూపంగాని ఇంకా ఏదీ ఏర్పడని మాట వాస్తవం- అయితే ఆ నూతన సామాజిక సమరశీల చైతన్యం తాలూకు ప్రభావం రచయితలపై కూడ పడటం ప్రారంభించింది- తత్ఫలితంగానే వ్యక్తులుగాను గ్రూపులుగాను కూడ ఈ నూతన పరిస్థితులకు ప్రజా పోరాటాలకు కొందరు రచయితలు ఉత్తేజితులై స్పందించటం ప్రారంభమైంది- వివిధ రకాల క్రొత్త క్రొత్త ధోరణులు సాహితీ రంగంలో చోటుచేసుకోసాగాయి- అవన్నీ శాస్త్రీయమైనవైనా కాకున్నా దేశంలో ఒక నూతన సాహితీ సంచలనాన్ని కలిగించిన మాట వాస్తవం. ఈ పరిస్థితుల్లో ఈ నూతన స్పందనకు గురియైన వివిధ రచయితలు కళాకారులు ఒక నూతన విప్లవ జనసాహితీ సమాఖ్యగా రూపొందడానికి తగిన వాతావరణం ఖచ్చితంగా ఏర్పడింది.

సెవెన్ స్టార్ సిండికేట్ వారి ఆధ్వర్యంలో, తదితర అవకాశవాదులు, భజనరాయుళ్ళ సహకారంతో, దోపిడీ పాలకవర్గాల విరాళం అనే లంచంతో- ఏనాడో ధ్వని పక్షపాతానికి గురైన అ.ర.సం. ను పునరుద్ధరించేందుకు 1970 లో జరిగిన ప్రయత్నం సందర్భంలో ఏర్పడ్డ విరసంలో వి.ర.సం. ఆవిర్భవించటం ఒక యాదృచ్ఛిక సంఘటన అని మాత్రమే నా అభిప్రాయం. విరసం లాంటి ఒక నూతన మిలిటెంట్ విప్లవాత్మక సాహితీ సాంస్కృతిక సంస్థ ఏర్పడటానికి కావలసిన పరిస్థితులు, ఏర్పడవల

సిన అవసరం అప్పటికే ఏర్పడ్డాయన్నది నా స్పష్టీకరణ. అందువలన విరసం ఆవిర్భావం ఒక చారిత్రక అవసరమని, అది ఒక చారిత్రక సంఘటన అని నా అభిప్రాయం.

2 ఎమర్జన్సీకి పూర్వం విరసం ఒక రాజకీయ సంస్థగా మారిందన్న ఆరోపణ పాలకవర్గాలు మొదలు విరసంలోని కొందరు సభ్యులు, కొందరు మిత్రులు, తటస్థుల వరకు అనేక మంది నుండి తీవ్రంగా వచ్చింది- విరసం ఒక రాజకీయ సంస్థగా రూపొందటమే విప్లవ సాహిత్యోద్యమ వికాసానికి, ప్రజా విముక్తి సాధనకు లాభకరమైనట్లయితే పాలకవర్గ ఆరోపణలను ఎంత మాత్రం లక్ష్యపెట్టకుండా దాన్నలా కొనసాగించటం అవసరమే అవుతుంది- కాని నిజం అదికాదు. ప్రపంచ అనుభవం కూడ అది నిజం కాదనే అన్నది- మన అనుభవం కూడ అలాంటి విధానం సముచితం కాదని ఇప్పటికే తేల్చివేసింది- నిజానికి విరసంలోని కొందరు సభ్యులు, తదితర మిత్రులు, శ్రేయోభిలాషులు, చివరకు తటస్థులు కూడ విరసం రాజకీయ సంస్థ స్వరూపాన్ని ధరించటాన్ని హర్షించలేదు- అయితే వారి విమర్శలకు, సలహాలకు, ఆవేదనలకు సకాలంలో సరియైన విలువ యివ్వటం జరగలేదు- అలాంటి సలహాలిచ్చిన వారిని ఆచరణలో పరిహసించటం, కించపరచటం కూడ జరిగింది- అందువల్ల విరసం ఎమర్జన్సీకి పూర్వం మాటల్లో ఏమి చెప్పినా ఒక రాజకీయ సంస్థ పద్ధతుల్లోనే పనిచేసిందన్న ఆరోపణ సహజమే- అది అక్షరాల న్యాయమే.

అయితే విరసం ఈ పని బుద్ధిపూర్వకంగా చేయలేదని నా అభిప్రాయం. అందుకు ప్రాతిపదికలు దాని పుట్టుకలోనే ఉన్నాయన్నది వాస్తవం- నిజానికి విప్లవ సాహితీ సాంస్కృతిక ఉద్యమం రాజకీయాలకు ప్రత్యక్షంగా బాధ్యత వహించే సంస్థ కాజాలదు. సామాజిక పరిణామ దశలోని ఒక దశ తాలూకు వ్యవస్థను కూల్చివేసి మరొక దశవైపు సమాజాన్ని నడిపించి నూతన వ్యవస్థను నెలకొల్పటానికి అవసరమైన సిద్ధాంత రాజకీయాలను, వ్యూహం - ఎత్తుగడలను రూపొందించి నిర్వహించవలసిన రాజకీయ కర్తవ్యం - విప్లవ మార్క్సిస్టు లెనినిస్టు పార్టీది మాత్రమే- మార్క్సిస్టు భావాలుగల రచయితలు వ్యక్తులుగా అలాంటి పాలసీని రూపొందించటంలో తమ మేధస్సును గూడ ఉపయోగించి అలాంటి విప్లవ రాజకీయ పార్టీకి తోడ్పడవచ్చు- కాని సాహితీ సాంస్కృతిక వేదికను అలాంటి విప్లవ మార్క్సిస్టు పార్టీకి చెందిన ప్రత్యక్ష బహిరంగ వేదికగా రూపొందించే హక్కు- ఏ విప్లవ మార్క్సిస్టు రచయితకూ లేదు. విప్లవ సాహితీ సాంస్కృతిక సంస్థ ఏదైనా అది ఒకానొక దశలో ఒకానొక సామాజిక లక్ష్యానికి సాగే ఉద్యమంలో తన వంతుగా సాహితీ సాంస్కృతిక కార్యక్రమంద్వారా

దోహదం కల్గించటం మాత్రమే తన లక్ష్యంగా పెట్టుకోవాలి- అంతేకాని అసలు విధాన నిర్ణేతగా, పార్టీ కార్యక్రమ ప్రచార వేదికగా తనను తాను రూపొందించుకో కూడదు. విప్లవ రాజకీయ పార్టీకి, విప్లవ సైన్యానికి ఉండవలసిన సంబంధం ఎలాంటిదో విప్లవ పార్టీకి, విప్లవ సాంస్కృతిక సంస్థకు ఉండవలసిన సంబంధం కూడ అలాంటిదే. ఈ సత్యాన్ని గుర్తించక పోవటం అంటే శ్వానం బాధ్యతను ఖరం నెత్తిన వేసుకోవటం వంటిదే- విరసం విషయంలో జరిగింది సరిగ్గా ఇదే- అందుకు మార్క్సియన్ సోషలిజమే, మావో ఆలోచనావిధానమే మా ధ్యేయం, సిద్ధాంతం అన్న అంశాన్ని విరసం ప్రణాళికలో ప్రధాన అంశంగా చేర్చటమే ప్రత్యక్ష నిదర్శనం. నిజానికి సాహితీ రంగంలో మార్క్సిస్టు దృక్పథం అంటే చారిత్రిక పరిస్థితులకు అనుగుణమైన రీతిలో సాహితీ సాంస్కృతిక ఉద్యమానికి అగ్రగామి పాత్ర వహించటమే. అంటే ప్రధానంగా పోరాట దీక్షకు అవసరమయిన భావ విప్లవాన్ని సాధించటమే. సమాజ పరిణామంలో రావలసిన తక్షణ దశకు సంబంధించిన కార్యక్రమానికి, తత్సంబంధం గల అంటే ఆ లక్ష్యానికి కలిసిరాగల వర్గాలను, శక్తులను సమీకరించటమే. అంతేగాని మార్క్సియన్ సిద్ధాంతం యొక్క అంతిమ లక్ష్యం వర్గ రహిత సమాజం కనుక దానినే ఉద్యమం తాలూకు ప్రాథమిక దశలకు కూడ లక్ష్యంగా ప్రకటించటం అర్థరహితం. సామాజిక పరిణామ క్రమంలోని తదుపరి తక్షణ దశ సోషలిస్టు సమాజం అయినప్పుడు మాత్రమే మార్క్సిస్ట్ తాను పనిచేస్తున్న సంస్థకు ఆ ఆశయాన్ని లక్ష్యంగా ప్రకటించాలని కోరతాడు- అలా కానప్పుడు కూడ అంతిమ లక్ష్యాన్ని తక్షణ లక్ష్యం అనే అర్థం వచ్చేలా ప్రకటించడం అంటే అలాంటి దృక్పథం సిసలైన మార్క్సిస్ట్ దృక్పథం కాజాలదు. విరసం ప్రణాళికలో సరిగ్గా యిలాంటి పొరపాటే జరిగింది. ఇక్కడ విరసం ప్రణాళికలో లాగా మార్క్సిజం-లెనినిజం అంగీకరించడం సంస్థ సభ్యత్వానికి ప్రాతిపదికగా లేకపోబట్టె లోగడ ఏర్పడ్డ అరసం భ్రష్టు పట్టి పతనమై పోయిందనేదే ఆ భ్రమ. నిజానికి నిజమైన విప్లవ మార్క్సిస్ట్ పార్టీ అరసంలోని మార్క్సిస్ట్ రచయితలకు సరియైన మార్గదర్శకత్వం అందించలేక పోయిన ఫలితంగానే భ్రష్టుపట్టిన కమ్యూనిస్ట్ ఉద్యమంతో బాటు అరసంకూడ పతనానికి గురియైందన్నది చారిత్రిక వాస్తవం.

నిజానికి ప్రస్తుతదశ జనతా ప్రజాతంత్ర విప్లవ దశ మాత్రమే. సోషలిస్ట్ విప్లవ దశ కానేకాదు. ఈ దశలో కలిసివచ్చే ప్రస్తుత సమాజంలోని వివిన్న పీడిత వర్గాలు మాత్రమే ఇందులో భాగస్వాము లవుతారు. ప్రస్తుత దశలోని వివిధ ప్రధాన పీడక వర్గాలకు వ్యతిరేకంగా సమీకృతులవుతారు; పోరాడుతారు. ఈ సందర్భంలో

ఈ పీడితవర్గాల తాలూకు రచయితలందరు ఈ దశలో ఏర్పడే విప్లవ సాహితీ సాంస్కృతిక ఉద్యమంలో భాగస్వాము లవుతారు. జనరల్‌గా దోపిడికి, పీడనకు, తదితర సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించే అన్నిరకాల రచయితలు ఇందులో భాగస్వాము లౌతారు. వారిని తమ శాస్త్రీయ సైద్ధాంతిక పరిజ్ఞానం, అవగాహనల ద్వారా, విశ్లేషణా బలంద్వారా, తమ కళాత్మక శక్తిసామర్థ్యాల ద్వారా తమ దృక్పథం వైపుకు ఆకర్షించుకోవటం మాత్రమే మార్క్సిస్ట్ రచయితల, కళాకారుల కర్తవ్యం. నూతన ప్రజాతంత్ర విప్లవం జయప్రదమై సమాజంలో నూతన వైరుధ్యాలు సహజంగానే ఏర్పడి సోషలిస్ట్ సమాజ నిర్మాణమే తక్షణ కర్తవ్యంగా రూపొందినపుడు (రూపొందటం అనివార్యం) నూతన శక్తుల సమ్మేళనం ఏర్పడి విప్లవ సాహితీ సాంస్కృతిక సంస్థకు కూడ సోషలిస్ట్ ధ్యేయం ప్రకటించుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. అప్పటి దశలోని పీడక వర్గాలకు వ్యతిరేకంగా అప్పటి పీడిత వర్గాల తాలూకు రచయితలు అప్పటి విప్లవ సాహితీ సాంస్కృతిక సంస్థలో సమీకృతులవుతారు. అప్పుడైనా ఆ సాహితీ సాంస్కృతిక సంస్థ సభ్యులందరూ విప్లవ రాజకీయ పార్టీలో విధిగా సభ్యులుగా ఉండవలసిన పరిస్థితి ఉండదు. అప్పుడైనా మార్క్సిస్ట్ రచయితలు బలవంతంగా కాక తమ సిద్ధాంత విశిష్టత, ఉద్యమంలో అగ్రగామిత్వం, కళాత్మక సామర్థ్యం ద్వారానే ఇతర రచయితలను తమవైపు ఆకర్షించుకుంటారు. ఉద్యమం యొక్క ట్యూన్‌ను, టోన్‌ను పరిరక్షిస్తారు- లక్ష్యం వైపుకు నడిపిస్తారు- విరసం నాయకత్వానికి అలాంటి అవగాహన లేకపోవడమే యిన్ని అనర్థాలకు దారితీసింది.

అయితే విరసం నాయకత్వానికి అలాంటి అవగాహన లేకపోవటానికి గూడ ఒక సహజమయిన కారణమే ఉంది. మార్క్సిస్ట్, లెనినిస్ట్, మావోయిస్ట్ సైద్ధాంతిక ఆచరణాత్మక అవగాహన గల నిజమైన విప్లవ రాజకీయ పార్టీ నిజంగా రూపొంది ఉంటే విరసం ఒక విప్లవ సాహితీ సాంస్కృతిక సంస్థగా సరియైన సాహితీ సాంస్కృతిక నాయకత్వం వహించే విధంగా విరసం నాయకత్వానికీ, సభ్యులకు గూడ సరియైన శాస్త్రీయ అవగాహన విధిగా అందించ గలిగేది- అది జరగటం సాధ్యం కానందునే లంపెన్, యుటోపియన్, పెట్టీబూర్జువా మేధావులు తగినంత సంఖ్యలో విరసంలో ప్రవేశం పొందడం జరిగింది. తత్ఫలితంగా ఆలోచనకంటె ఆవేశం, వ్యూహం, యెత్తుగడల స్థానంలో అరాజకం సిద్ధాంతమైపోయింది- తత్ఫలితంగా విప్లవ కమ్యూనిస్ట్ రాజకీయాల్లోని కొన్ని గ్రూపులు అపరిపక్వ దశలో ప్రవేశపెట్టి, పట్టు విడుపులు లేకుండా యెత్తు పడిపోయేదాకా కృత్రిమంగా అమలు జరిపిన సాయుధ పోరాట నినా

దాలతో, వర్గ శత్రు నిర్మూలనా కార్యక్రమంపేర వ్యక్తిగత హింసావాదాన్ని ప్రచారం చేసే సాహిత్యాన్ని కృత్రిమంగా సృష్టించడం విపరీతంగా జరిగింది. తత్ఫలితంగా ఆ కార్యక్రమాలను సాగించిన విప్లవ రాజకీయ గ్రూపులు ఎలా ప్రజల నుండి వేరు పడిపోవడం జరిగిందో అలాగే విరసం కూడ విస్తృత ప్రజా రచయితల సమూహం నుండి, ప్రజల నుండి కూడ వేరుపడిపోయి అతి పరిమితమైన సంకుచిత పరిధికి దిగ జారిపోయిన మాట నిజం. విప్లవ రాజకీయ పార్టీకి, విప్లవ ప్రజా సాహితీ సాంస్కృతిక సంస్థకు గల తేడాను విరసం చెప్పుకోదగ్గంతగా తగ్గించిన మాట కూడా నిజమే. అందువల్ల విరసం మీద వచ్చిన ఆరోపణ నిరాధారం మాత్రం కాదు. ఈ కారణంగా ఒక విప్లవ ప్రజా సాహితీ సాంస్కృతిక ఉద్యమ నాయకుడిగా విరసం తన లక్ష్యానికి కలిగించిన నష్టం యింతా అంతా కాదన్నది కూడ నిర్వివాదాంశం.

3 ఎమర్జన్సీలో విరసం విధానాలకు ఆలంబనమైన రాజకీయ గ్రూపుకు సంభవించిన స్థితే విరసంకు కూడా తటస్థించింది. నిజానికి ఎమర్జన్సీకి ముందే సదరు రాజకీయ గ్రూపు కార్యక్రమాలు, విరసం కార్యక్రమాలు గూడ ఒక రకమైన సంక్షోభంలో పడి స్థంభనకు గురికావడం జరిగింది. ఎమర్జన్సీ రాగానే విరసం యొక్క బలహీనతలన్నీ మరింత నగ్నంగా బయట బడ్డాయి. 'ఊగరా ఊగరా' అన్న మహా విప్లవ కవులే ఇందిరా 'వామపక్షం' తాలూకు ఇరువై సూత్రాలు మెడకు తగిలించుకొని 'సాగరా సాగరా' అంటూ ఆత్మ వంచనకు, పర వంచనకు పాల్పడటం, మరి కొందరు ప్రభుత్వానికి అండర్ టేకింగ్ లివ్వడం, అనేక రకాల అల్పమైనసాకులతో సంస్థ నుంచి ప్రక్కకు తప్పుకొని, ఇతర చెక్క భజన సాహితీ సంస్థలలో చేరి ప్రకటిత ఆశయాలకు తిలోదకాలివ్వడం వగైరా సంఘటనలు యాదృచ్ఛికం ఎంత మాత్రం కాదు. సహజ పరిణామమే. అందుకు తోడు విరసంకి ఎక్కువ మంది ప్రజా సాంస్కృతిక కార్య కర్తలను కలుపుకురాగల శాస్త్రీయమైన విశాలమైన పరిధి గల ఆచరణాత్మక ప్రణాళిక లేదు. బాధ్యతలు బాధ్యతగా నిర్వహించ లేని ప్రముఖులు, వ్యక్తిగత జీవితాలలో అవకాశవాద అక్రమ ప్రవర్తనకలవారు, అనేక వ్యసనాలకు దాసులు, తమ పరిధిలో గల మేరకైనా సాంప్రదాయ శృంఖలాలను ఉల్లంఘించలేని వారు, అశాస్త్రీయ దృక్పథాన్ని అధిగమించ లేని వారు, నిత్య జీవితంలో ఆదర్శ ఆచరణ ధోరణులు లేనివారు సభ్యులలో తగినంత మంది ఉండటం సంస్థ యొక్క తిరోగమనానికి అదనపు కారణంగా పరిణమించింది. ఈ కారణాలన్నీ కలిసి ఎమర్జన్సీలో సంస్థ జడప్రాయం కావడానికి దారి తీసింది. అదివరకే 'రాజకీయ సంస్థ' అన్నముద్రవేయ బడటానికి తెలిసో తెలియకో అవకాశం ఇచ్చిన ఫలితంగా

ఎమర్జన్సీలో విరసం ఒక రచయితల, మేధావుల సంస్థగా తన కనీస బాధ్యతలను గూడా నిర్వర్తించలేని స్థితి దాపురించింది. విరసం సరియైన సిద్ధాంత అవగాహన, ఆచరణాత్మక కార్య క్రమంతో సాహిత్య సాంస్కృతిక నాయకత్వాన్ని అందించ లేక పోయిందన్న అంశం ఎమర్జన్సీలో నగ్నంగా ఋజువైంది. అది కూడ సహజ పరిణామమే కాని యాదృచ్ఛికమేమి కాదు.

4 తమ తమ మార్క్సిస్ట్ వ్యతిరేక, సంకుచిత, సెక్టేరియన్ విధానాలను కృత్రిమంగా విరసంపై రుద్ది సంస్థ ఈ స్థితికి రావటానికి కారకులైన వ్యక్తులూ, వర్గాలే విరసంకు రాజకీయాలు లేకుండాపోతున్నాయని ఆందోళన పడిపోతున్నారు. విరసంలో ఇప్పుడిప్పుడే మొలకెత్తుతున్న ఆత్మవిమర్శనా ధోరణి వీరికి ఎంతమాత్రం ఇష్టంలేదు. నిజానికి విరసంలో లోతైన, చిత్తశుద్ధిగల ఆత్మవిమర్శా ధోరణి ఇప్పటికీ యింకా రూపొందనేలేదు. ఇప్పుడు రూపొందినట్లు కనబడుతున్నది నిజమైన ఆత్మవిమర్శ తాలూకు ఆభాస మాత్రమే. ఈ మాత్రానికే ఆందోళన పడిపోతున్న వ్యక్తులూ, శక్తులూ, వర్గాల అసంతృప్తికి లొంగిపోయి విరసం తన ఆత్మవిమర్శకు స్వస్తి చెప్పటం ఆత్మహత్యాసదృశం మాత్రమే అవుతుంది. అందువల్ల విరసం సభ్యులు చిత్తశుద్ధిగల ఆత్మవిమర్శకు మరింతగా దోహదం చెయ్యడం విరసం ఉజ్వల భవిష్యత్తుకు విప్లవ సాహిత్యోద్యమ వికాసానికి, పీడిత ప్రజల విశాల ప్రయోజనాలకు కూడ ఎంతో అవసరం.

5 విరసం ప్రజాసాహిత్యానికి, సంస్కృతికి ఏమీ చెయ్యలేదని శత్రువులు కూడ అనలేరు. ఒక్క మాటలో సాహిత్య రంగంలో దోపిడీ వర్గాలముందు రివిజనిజం తెల్లజెండా ఎత్తగా విరసం పీడితవర్గాల సమరశీలానికి చిహ్నమైన అరుణపతాకాన్ని యెత్తిందనడం నిస్సందేహం. అయితే మరొకటి కూడ నిజం. విరసం ప్రజాసాహిత్యానికి సంస్కృతికి చెయ్యాల్సినంత చెయ్యలేకపోవటమే కాక చెయ్యాలను కున్నంత కూడా చెయ్యలేక పోయిందని చెప్పక తప్పదు. అయితే వస్తువు రీత్యా చూచినా, కళాత్మక విలువల రీత్యా చూచినా, కొన్ని ఉత్తమంగా యెంచదగిన రచనలు వెలువడక పోలేదు. శ్రామికవర్గ దృక్పథానికి ప్రయోజనాలకు స్వస్తిచెప్పి లొంగుబాటుకు బలియై సమరశీలాన్ని కోల్పోయి, దిగజారి, జావగారి దోపిడీవర్గ పల్లకీ సేవలు చేస్తున్న అరసం సాహిత్య ధోరణులతో విసుగెత్తిపోయిన కొత్త తరం సమరశీల యువతరానికి కొత్త రక్తాన్ని, కొత్త ఆలోచనను అందించిన మాట నిజం. అయితే అది త్వరలోనే తన పుట్టుకలోనే ఉన్న సిద్ధాంత, ఆచరణలలోని అపరిపక్వతా జనితమైన వివిధ బలహీ

నతల కారణంగా– సెక్టేరియనిజానికి గురియైన కొన్ని విప్లవ రాజకీయ గ్రూపుల ప్రత్యక్ష ప్రాబల్యానికిలోనై విస్తృత ప్రజాసాహితీ సాంస్కృతిక వేదికగా గాక– కొద్ది మంది గిరులు గీసుకున్న వ్యక్తుల యుటోపియన్ ఎడ్వంచరిస్ట్ క్లబ్‌గా తయారైంది– నిమగ్నత నిబద్ధత అనే అంశాలపై మార్క్సిజం పేరిట తద్భిన్నమైన అశాస్త్రీయ, అవాస్తవిక, మొండివైఖరి చేపట్టింది.

ఇక అది సృష్టించిన సాహిత్యం గురించి రెండు మాటలు– ప్రజల చైతన్యంతో, ప్రజల పోరాట స్థాయితో నిమిత్తంలేని ఊహాత్మక విప్లవ రచనలు పుంఖాను పుంఖంగా వెలువడ్డాయి. అందులో ఎక్కువ భాగం కళాత్మక విలువలకు దూరమైన నినాద ప్రధానమైన వచన గేయాలు. కొన్ని గానయోగ్యమైన గేయాలుకూడ వెలువడకపోలేదు– అయితే మొత్తంమీద కవితల్లో ఎక్కువ భాగం కృత్రిమ ఉద్రేక ప్రధానమైనవి మాత్రమే. వర్గ శత్రు నిర్మూలన అనే భ్రమలో మార్క్సిజానికి బద్ధ వ్యతిరేకమైన వ్యక్తిగత హింసావాదాన్ని తీవ్రంగా ప్రబోధిస్తూ క్రమంగా ప్రజలకు దూరమైపోయిన రచనలు. నిజానికి విరసం సృష్టించిన విప్లవ సాహిత్యంవల్ల విప్లవోద్యమానికి సమకూరిన ప్రయోజనంకంటె జరిగిన నష్టమే హెచ్చుకావటం విచారకరం. నిజానికి కొందరు ప్రముఖ విప్లవ రచయితల రచనల వల్లనే విరసం తొలిరోజుల్లోనూ, తరువాత కొంతకాలం వరకు విప్లవ సాహిత్యంలో ప్రతిపాదించబడిన ఆలోచనకు గౌరవ ప్రతిష్ఠలు వచ్చాయని చెప్పటం న్యాయం. విరసం సృష్టించిన సాహిత్యం ప్రజా ఉద్యమ ప్రవాహంలో భాగంగా మమేకం కాలేకపోయినమాట నిజం. నిజానికి విప్లవ కార్యకలాపాలు తెలంగాణా పోరాట కాలం నాటివలె ఒక ప్రజా ఉద్యమంలా అభివృద్ధి కాలేక పోవటమే ఇలా జరగడానికి ఒక ప్రధాన కారణం. కథ, నవల, నాటిక, నాటకం, కావ్యం వగైరా ఇతర సాహిత్య ప్రక్రియల్లో సాహిత్యం చెప్పుకోదగిన రీతిగా వెలువడ లేదంటే అది ఈకాలంలో సాగిన విప్లవ కార్యక్రమాలు ఒక ప్రజా ఉద్యమస్వరూపం దాల్చలేదనటానికి ఒక ప్రత్యక్ష నిదర్శనం. కనుకనే విరసం ప్రతిపాదించిన విప్లవ ఆలోచనలోని సైద్ధాంతిక ఆచరణాత్మక బలహీనతల వల్ల క్రమ క్రమంగా ప్రముఖ రచయితల రచనలు కూడ ఎలాంటి ప్రభావం కలిగించలేక పోవడం సంభవించింది. ఆలోచనలోని శాస్త్రీయత, ఆచరణలోని వాస్తవికతలను బట్టి మాత్రమే నిజమైన విప్లవ సాహిత్యం, నిజమైన విప్లవోద్యమం అభివృద్ధి కాగలుగుతాయని మరోసారి ఋజువైంది.

**6, 7** వీటికి ప్రత్యేకంగా జవాబు చెప్పవలసిన పనిలేదనుకుంటాను. పై అయిదు ప్రశ్నల జవాబుల్లోని వివరణల్లోనే ఈరెండు ప్రశ్నలకు కూడా జవాబులున్నాయని

భావిస్తున్నాను. గత అయిదు ప్రశ్నలకు సంబంధించి వెల్లడించిన సైద్ధాంతిక, ఆచరణాత్మక లోపాలను చిత్తశుద్ధితో, సుహృద్భావంతో, లక్ష్య ప్రధానంగా లోతుగా నిజమైన ఆత్మవిమర్శ చేసుకుంటే విప్లవ ప్రజాసాంస్కృతిక ఉద్యమంయొక్క స్వరూప, స్వభావాలు కార్యక్రమాలు ఎలా ఉండాలన్నది సహజంగానే బోధపడుతుంది. అన్ని అవరోధాలను అధిగమించి విప్లవ ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం తన సైద్ధాంతిక, నిర్మాణ కార్యకలాపాల సమస్యలను తప్పక పరిష్కరించు కొంటుందనీ, మన ఉద్యమానికి ఉజ్వల భవిష్యత్తు కనుచూపు మేరలోనే ఉందని నాప్రగాఢ విశ్వాసం. అలాంటి రోజులు రావాలని నా ఆకాంక్ష.

## సృజన నిర్వహించిన పాత్రగురించి

'సృజన' నిర్వాహకులు వి.ర.సం. బాధ్యులుగా రూపొందకముందు 'సృజన' వివిధ నూతన మిలిటెంట్ సాహిత్య ధోరణులకు వేదికగాఉంటూ నిర్మాణాత్మక పాత్రను నిర్వహించింది. అది విరసం విధానాలను స్వీకరించినప్పటి నుండీ దాని ధోరణి మారి విరసం యొక్క అనధికార అధికార వాణిగా రూపుదాల్చింది. తద్ఫలితంగానే విరసం లో ప్రవేశించిన అన్నిరకాల మంచిచెడులకు, సెక్టేరియన్ అడ్వంచరిస్ట్ ధోరణులకు అది ప్రతిబింబంకాక తప్పలేదు. అందువల్ల ఈ సందర్భంగా సృజనను గురించి ప్రత్యేకంగా చెప్పడం అనవసరమే అవుతుంది. ఒక్కమాటలో వి.ర.సం గురించి చేసిన విమర్శలన్నీ సృజనకుకూడ సహజంగానే అన్వయిస్తాయి.

ఇకపోతే ఎమర్జన్సీలో సృజన గురుతర బాధ్యత నిర్వర్తించలేదన్న ఆరోపణలో అర్థంలేదని నాఅభిప్రాయం. ఎందువల్లంటే దోపిడీవర్గాలు తమ వర్గప్రయోజనాలకు ప్రవేశపెట్టుకున్న ఎమర్జన్సీలో సృజనలాంటి పత్రికల, విరసంలాంటి సాహిత్య సంస్థల కార్యకలాపాలను రహస్యంగా తప్ప మరొకరకంగా కొనసాగనిస్తారన్నది కేవలం భ్రమ మాత్రమే.

ఇకపోతే సృజన పరిధి తొలి నుండి కూడ పరిమితమైనదేనని నా అభిప్రాయం. ఏ సాహిత్య పత్రికైనా అది ప్రధానంగా రచయితలకు, సాహిత్య అభినివేశం, పరిచయంగల పాఠకులకు మాత్రమే పరిమితంగా ఉండటం సహజం. అది వారి చైతన్య, అవగాహనలను పెంచటానికి ప్రధానంగా ఉపయోగ పడుతుందని, ఉపయోగ పడాలని నా అభిప్రాయం. అలాంటి పత్రికలలో ప్రజలకోసం ఉద్దేశించి రచించి ప్రచురింపబడిన రచనలు సాంస్కృతిక సంస్థల ద్వారా మాత్రమే ప్రజల్లోకి వెళ్ళడం సాధ్య

పడుతుంది గాని నేరుగా సామాన్య ప్రజానీకం వద్దకు చేరడం అంతగా సంభవం కాదనే చెప్పవచ్చు. అందువల్ల సృజన తన పరిమితుల్లో కొంతమేరకు తన పాత్రను నిర్వహించటానికే ప్రయత్నించిందని చెప్పవచ్చు. అయితే అది సెక్టేరియన్ ధోరణికి లోనుకాకుండా, విప్లవ ప్రజా సాహితీ సాంస్కృతిక కార్యకర్తలందరి సమిష్టి వేదికగా తన పాత్ర నిర్వర్తించి ఉంటే అది విప్లవ సాహిత్యోద్యమానికి మరింతగా సేవచేయ గలిగి ఉండేది. అలా జరక్క పోవడం నిజంగా విచారకరమే.

ఇకపోతే సృజనలో రావలసిన రచనల గురించి రెండు మాటలు. సృజనలాంటి పత్రికలు నా దృష్టిలో ప్రధానంగా రచయితల పరిజ్ఞాన, చైతన్య, అవగాహనలను పెంచవలసిన బాధ్యత గలవి గనుక వివిధ దేశాల, భాషల సాహిత్య ధోరణులను విరి విగా పరిచయం చేయటం అవసరమే. అందుకు సరళమైన శైలిలో వివరణాత్మక వ్యాసాలు రావటం ఎంతైనా అవసరం. అది పూర్తిగా సాధ్యం కాకపోతే కనీసం అనువాదాల రూపంలోనైనా అలాంటి రచనలను ప్రచురించడం తప్పనిసరి. అలాగే వివిధ సాహితీ సమస్యలపై, కవితా ధోరణులపై చర్చావేదికలు నడపడం ఎంతో అవ సరం. అవి రచయితలను, పాఠకులను ఎంతో ఎడ్యుకేట్ చేసి వారి స్థాయిని పెంచ గలుగుతాయి. ఇతర దేశాల, భాషలలోని విశిష్ట కథల, కవితల అనువాదాలు ప్రచు రించడం కూడ అవసరమే. అయితే వాటికొక పరిమితి ఉండాలి. స్వతంత్ర రచనలకు సాధారణంగా యాభై శాతమైనా ప్రాధాన్యత యివ్వాలి. సమకాలీన ఆర్థిక, రాజకీయ, సామాజిక ధోరణులు, ఘటనలపై వివరణలు, వివిధ భాషలలోని విశిష్ట గ్రంథాల పరిచయాలు. అలాగే వివిధ రచయితల జీవితాలు, వారి రచనల పరిచయాలు ప్రచు రించాలి. అవి విమర్శనాత్మకంగా, ఎడ్యుకేటివ్‌గా ఉండాలి. సృజన యిప్పటిలాగా ఒకటి లేక రెండు విప్లవ రాజకీయ గ్రూపుల పత్రికగా గాక చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి గల వివిధ విప్లవ సాహితీ ధోరణుల సమిష్టి అధ్యయన పరిశీలనా వేదికగా ఉంటే బాగుంటుంది.

సృజన అలా రూపొందాలి. అప్పుడే కాలక్రమంలో అనుభవంనేర్పే గుణపాఠాల ద్వారా విప్లవోద్యమానికీ, దానికి ప్రతిబింబమైన ప్రజాసాహితీ సాంస్కృతిక మహో ద్యమానికి ఒక సమిష్టి సమైక్య దృక్పథం రూపొందగల క్రమానికి దోహదంచేసి ఆచ రణలో 'సృజన' నిజమైన సృజనాత్మక పాత్ర నిర్వర్తించగలదని నా విశ్వాసము. అలా నిర్వర్తించాలని నా ఆకాంక్ష.

— సి. ఆర్. రావ్
కావలి

(48 వ పేజీ తరువాయి)

ఆరోజు జోరున వాన కురిసింది.

మధ్యానం ఒంటి గంటయింది– వూరికి దూరంగా ఎక్కడో సామాను చేరవేసి వస్తున్నాడు– అతను వచ్చే దారంతా ఫుట్‌పాత్‌లమీద వాననీళ్ళన్నా మనుషులున్నారు– వాళ్ళందరికీ వుంటానికి వేరే చోటులేదు– కొంతమంది ఇటికలూ, కర్రముక్కలూ పేర్చి, గోడకానించి చిన్న గుడారాల్లా వేసుకొన్నారు– వానకీ గాలికీ కొన్ని ఎగిరిపోయాయి.

అతను ఒకచోట అలా ఆగిపోయాడు.

అతని ఎదురుగా ఫుట్‌పాత్ మీద ఉన్నది ఓ కుష్టువాడు– అతను ఎగిరిపోయిన చిన్న చిన్న తాటాకులను సర్దిపెట్టుకోవాలని తీవ్ర ప్రయత్నం చేస్తున్నాడు– కొద్దిగా అవతల వుంది ఓ నల్లకుక్క– అది అతన్ని దీర్ఘంగా చూస్తోంది– ఒక్కసారి గాలి ఎదురు కొట్టింది– ఓ తాటాకుతో పాటుగా ఎగిరిపోయాయి అతని చేతి వేళ్ళు రెండు– అవి కొద్దిదూరంలో పడగానే నల్లకుక్క వాటిని గభాల్న నోటితో కర్చుకొని పారిపోయింది.

ఆ కుష్ఠతను గాలికి తూలి పడిపోయాడు.

చిట్టి అతన్ని పట్టుకు లేవనెత్తాడు– అతని కెందుకో కుష్ఠు మనిషిని చూసి చీదరింపు కలుగలేదు– విపరీతమయిన ఏడ్పు కన్పించింది చిట్టికి అవతల మనిషి ముఖంలో.

"నేను చదువుకున్నోడినే– కానీ, పకరోజు ఈ దౌర్భాగ్యం పట్టుకొంది– పేటలో అందరూ బయటకు ఈడ్చేశారు నన్ను– 'ఇది భయంకర పాపంకాదు, జబ్బు' అని ఎంత ఏడ్చినా వినలేదు ఎవరూ–" అన్నాడు అవతల మనిషి. ఇంకా అతనే చిట్టితో అన్నాడు–

"ఇది కుష్ఠులోకం– పేదరికం అలా చివరికంటా వెళ్తే కుష్ఠు రోగంతో చివరి దశకి వెళ్తుంది– ఈ దరిద్రం దేశంలో ఇలా తప్పదు" అని.

చిట్టి భయంగా అతని వంక చూశాడు– అవతల మనిషి ఇంకా చాలా చెప్పాడు గానీ అవేమీ చిట్టికి అర్థంకాలేదు– అతని కర్థం అయిందల్లా ఒక్కటే–

– 'దరిద్రులంతా ఆఖరికి కుష్ఠు బతుకు బతుకుతారేమో' నని.

ఆతర్వాత బస్తీ గుడిసెల మధ్యకి లాంతర్లు పట్టుకొని రాత్రిళ్ళ కొంతమంది వచ్చేవారు– మొదట్లో వాళ్ళు జనాల్ని కూర్చోపెట్టి చదువు నేర్పించటం మొదలు పెట్టారు– మెల్లిగా వాళ్ళు గుడిసెల్లో బతుకుతున్నవాళ్ళు వాళ్ళకి అంత దరిద్రం ఎలాచుట్టుకొంటూ వుందీ చెప్పటం మొదలుపెట్టారు– చిట్టి వాళ్ళతో తరచూ మాట్లాడుతూ వుండేవాడు.

కొంతకాలంకి ఓరోజు రాత్రి ఓ లారీలో కొందరు గుండాలు వచ్చారు_ వాళ్ళకీ లాంతర్ల వాళ్ళకీ విపరీతమయిన దెబ్బలాట జరిగింది_ స్పృహ తప్పిపోయిన వాళ్ళను లాంతర్లతో సహా వాళ్ళు తీసుకొని వెళ్ళిపోయారు.

ఆ తర్వాత ఒకతనుమాత్రం గుడిసెలకు అప్పుడప్పుడూ వస్తూండేవాడు.

చిట్టికి అతనితో దోస్తీ అయింది.

మనుషులు చావు బతుకు లెందుకు బతుకుతున్నారో అతనికి మెల్లిగా అర్థం అవటం మొదలు పెట్టింది.

* * *

గదిలో అంతా గోలగా వుంది.

చంద్రశేఖరంకి విసుగొచ్చేస్తుంది_ బజారు మూసెయ్యటం వల్ల విపరీతంగా నష్టాలు వస్తాయని అందరికీ తెల్సు_ కానీ కూలీ వెధవల్ని మారాంచేస్తే బతకలేం అని అందరూ అనటంవల్ల అతనూ జంకుతున్నాడు_ అదీకాక బజారు తెరిచినా వాళ్ళంతా సామానులు మోస్తారని అతనికి నమ్మకం కలగటంలేదు_ అందుకే అతనూ ఓపిక పట్టాల్సి వస్తోంది.

"మీరు బజారు తెరవకపోతే కోర్టు కెళ్ళాల్సొస్తుంది" అన్నాడు రంగసామి.

"కోర్టుకెళ్ళినా, నరకానికెళ్ళినా మా కొంపేం మునగదు_ మనుషులమీద మనుషులకి నమ్మకం లేకపోయింతర్వాత ఏం అనగలం?"

"ఇందులో నమ్మకం ప్రసక్తి ఏం వుంది" అన్నాడు రంగసామి_ "బోనస్ ఇయ్యమంటున్నాం_ అంతంత బరువులు మొయ్యించటం అన్యాయం అంటున్నాం_ తీసేసిన వాళ్ళను ఎందుకు తీసేసారు అంటున్నాం_"

"చూడు రంగసామీ, బరువుల గురించి మేం ఏంచేస్తాం చెప్పు? గవర్నమెంటుకు రాస్తాం_ కొద్దిరోజుల్లో మారచ్చు_ ఇకపోతే కూలీరేట్లు పెంచుతాం" అన్నాడు చంద్రశేఖరం.

"అదేటి లాబం" అన్నాడు రంగసామి_ "బోనస్ ఇయ్యటాని కెందుకంత యిదీ?" చంద్రశేఖరంకి విసుగొచ్చింది_ 'ఇది తేలే తగువుకాదు' అనుకున్నాడు.

తర్వాత వారం రోజులకు

కోర్టు నుంచి ఆర్డరు వచ్చింది_

బజారు తెరవాలని, ప్రజలకు అవసరం అయిన వస్తువులన్నీ గోడవున్లలో పెట్టుకొని బంద్ చెయ్యటం చెల్లదని.

కూలీవాళ్ళ గోల పడలేక ఆపని చేశాం అని బజారుపెద్దలు అన్నారుగానీ జడ్జీ గారు వినలేదు.

"వాళ్ళు సక్రమంగానే పని చేస్తాం అని అంటూనేవున్నారు— అంతమంది కడుపులు కాలుస్తూ కూర్చోటం కూడా న్యాయంగాలేదు—" అన్నాడాయన.

"మరి గవర్నమెంటు వాళ్ళు మాకు సాయం వుండకపోతే మేం బతకలేం— అల్లర్లు జరిగితే దాన్ని అదుపులో పెట్టాల్సిన బాధ్యత లా అండ్ ఆర్డర్ వాళ్ళకీ వుంది" అన్నాడు చంద్రశేఖరం— అతనికీ తెల్సు, పోలీసువాళ్ళు ఈ విషయంలో అంత సాయం రాకపోవచ్చని. ప్రోగ్రెసివ్ గవర్నమెంటు అన్పించుకొంటున్న ఈ రాష్ట్ర గవర్నమెంటు కార్మికులమీద పోలీసుల్ని పంపించటంలేదు ఈమధ్య— అదీకాక లేబర్‌మంత్రి ఆ మధ్య అసెంబ్లీలో పెద్ద వాగ్వివాదం పెట్టుకొని 'ఇండ్ డిస్ప్యూట్లలోకి' పోలీసు బలగాన్ని బలవంతంగా దూర్చకూడదనే విషయం సాధించాడు.

* * *

బజారు తెరుస్తున్నారు!

ఆ విషయానికి బస్తీలో జనం లేచి గెంతారు— మూడు నెలలు దాటిపోయింది వాళ్ళకి సరిగా పనిచేసి— ఆకలిగావున్న గుంపు దూరంగా చెరువునీళ్ళో ఆహారం గుట్టో కనబడితే పరిగెత్తినట్లు బజారువైపు పరిగెత్తారు.

* * *

"నల్లబాబుకాడ సొమ్ము లేకేం? ఇయ్యవుగాని" అని కసురుకొంది చంద్రమతి.

"ఏటే పిల్లా, లేవంటే ఇనుకోవేఁ" చిరాకుపడ్డాడు నల్లబాబు— అతన్ని కాలా గాడు అని కూడా అంటారు మనుషులు. మనిషి విపరీతమయిన నలుపు. అతనికి పాతికేళ్ళుకూడా వుండవు.

"తొంగోటానికయితే పడిషి మాత్తరం కావాల్నా—"

"ఏటే లంజా— ఏటా పొగరు" నల్లబాబు చేతిలో ఖాళీఅయిపోయిన సారా సీసా పగిలిపోయింది— తారాజువ్వలా కోపం పైకెగిరి మళ్ళీ కిందపడిపోయింది— "ఇలా రాయే—" అన్నాడు సౌమ్యంగా.

చంద్రమతి దగ్గరకొచ్చింది.

“అంత కోప్పడకే పిల్లా, నీకు సొమ్ము లేగా కావాల– తెస్తాలేయే–”

నల్లబాబు పేవ్‌మెంట్ మీద పుట్టాడు– అతని అదృష్టం బావుంది కాబట్టి ఏ జంతువూ పీక్కుని తినలేదు– పదేళ్ళ వయసుకి స్వేచ్ఛగా రోడ్లమీద పడ్డాడు.

నల్లబాబు ముష్టి ఎత్తుకోలేదు ఎప్పుడూ.

పన్నెండేళ్ళప్పుడయితే అతను పెద్దరోడ్డు జంక్షన్‌లో వుండేవాడు– హోటళ్ళ ముందు గంటలు గంటలు ఆగివుండే కార్లకు ప్రమాదాలు జరక్కుండా కాపలా కాసేవాడు– 'ఎంతరా?' అంటే, 'రూపాయి' అనేవాడు– ఓసారి ఓ పీనాసి మనిషి 'నాకేం కాపలా అక్కర్లేదు' అని అరిచి వెళ్ళిపోయాడు– అతను పని చూసుకొని వచ్చేసరికి కారు పెట్రోలు టాంకు మూత లేదు– డోర్ హేండిలూ కనపడలేదు– వానపడినప్పుడు తుడుస్తూ ఉండేది అదీ విరిగిపోయింది– అతనికి ఓ మూలగా పళ్ళికిలిస్తూ కూర్చున్న నల్లబాబు కన్పించాడు.

నల్లబాబు తెలివి తక్కువ్వాడు కాదు– కాకపోతే బూట్లు పాలిష్‌చేసే సరంజామా కొని ఆస్తిపరుడవాలని అతను ఆలోచించలేదు– వచ్చిన సొమ్మంతా సినిమాలు చూట్టానికే సరిపోయేది– బీడీలు కూడా కొనేవాడు– తింటానికీ, తలదాచుకోటానికో గుడిసే, ఇవన్నీ ఎప్పుడూ ఖాతరు చెయ్యలేదతను.

ఇళ్ళ చుట్టూ, హోటళ్ళబయటా తిండి పదార్థాలు పారేసినవి దొరికితే తినేవాడు– చిన్నతనంలో పెద్ద పెద్ద గుంపులుగా కుర్రాళ్ళంతా వీధుల్లోపడి తిరిగేవారు– రోడ్లమీద ఎముక ముక్కలు తిండితోబాటు దొరికితే వాటి మూలల్లో ఉండే మాంసం కోసం కొట్టుకొనేవాళ్ళు.

ఆ కొట్లాటల్లో నల్లబాబు చాలామార్లు గెలిచాడు– దాంతో అతను ఓ పదిమంది కుర్రకారు గాంగుకి పెద్దఅయ్యాడు– వాళ్ళ పని చిన్నచిన్న దొంగతనాలూ– బస్సుల్లో, రద్దీ చోట్లలో జేబులు కొట్టటాలూ.

ఒక సారెవరో ఆసామి నల్లబాబుని పట్టుకొన్నాడు– నల్లబాబు జేబుకొడుతూ దొరికిపోయాడు– ఆసామి నీతిగా బతకమని చాలాసేపు చెప్పి, ఊరుకోక దేవుడి గుడికో దానికి తీసికెళ్ళి పాపం గురించీ పుణ్యం గురించీ చెప్పాడు.

అంతా విన్న తర్వాత నల్లబాబు వికారంగా నవ్వాడు.

ఆ తర్వాత గుళ్ళముందు అడుక్కోవటానికీ, జేబులు కొట్టటానికీ అవకాశాలు ఏక్కువని నల్లబాబు కుర్రకారుకి చెప్పాడు.

ఒకోసారి నల్లబాబు న్యాయంగానే సొమ్ములు గడించేవాడు– ఖాళీ సీసాలూ, చిత్తు కాయితాలూ– ఏ చెత్తయినా దొరికితే దాన్ని గోనె సంచుల్లో మోసుకెళ్ళేవాడు– మహానగరంలో ప్రతి చెత్తకీ ఓ రేటుందని అతనికి తెల్సు– ఏ పనీ లేకపోతే చెత్త కుండీల్లో పేకముక్కలు దొరికితే వాటితో రోడ్డుమీదే కూర్చుని ఆడుతూ కూర్చునేవాడు.

అతనికి పద్దెనిమిదేళ్ళొచ్చాక తెల్సింది– బతుకులో ఆడదాని సుఖం అంటూ వకటి వుందని– దానికి మరిగింతర్వాత అతనికి సొమ్ములు అవసరం మరింత అన్పించింది.

తర్వాత అతన్ని అందరూ 'గుండా వెధవ' అంటం మొదలుపెట్టారు– అలాంటి వాళ్ళు వూర్నిండా చాలామందున్నారు.

పూర్వం బయట దేశాలవాళ్ళు కంపెనీలు చాలా ఆ వూర్లో పెట్టుకొన్నారు– కాపలాకీ, సరుకులు అమ్మటానికీ కొనటానికీ– కత్తులూ కటార్లూ తుపాకులూ ఇచ్చి మనుషులను పెట్టుకొనేవాళ్ళు– వాళ్ళకి కంపెనీకున్న అధికారం అంతా వుండేది– కంపెనీలవాళ్ళ రాజ్యం అయిపోయినా వాళ్ళంతా అలానే వుండిపోయారు– ఇప్పుడు వాళ్ళు కంపెనీల తరఫున ఉద్యోగాల్లో లేకపోయినా గుండాలుగా వాళ్ళ బతుకులు వెళ్తూనే వున్నాయి.

నల్లబాబు చాలా మందికి పనిచేసేవాడు– కార్మిక సంఘాల్తో గొడవలొచ్చి నప్పుడూ, ఎలక్షన్లప్పుడు– అతనికి చేతినిండా పని.

నల్లబాబు భయంకరంగా వుండడు– సన్నగా (పీలగా) వుంటాడు– అయినా ఒకచేత్తో ఒకనిముషంలో పది షోడాబుడ్లను బాంబుల్లా విసుర్తాడు– మొదట్లో అతనిదగ్గిర చాకులుండేవి– బాగా పేరొచ్చింతర్వాత చిన్న పిస్తోలు సంపాదించాడు 'ఆత్మరక్షణ'కి.

"ఏటా పరాకు" అని చంద్రిమతంటే–

'వూఁ' అన్నాడతను– "నీ సొమ్ములొస్తాయిలే–" అనంటూ బయటకు వెళ్ళిపోయాడు.

*　　*　　*

చంద్రశేఖరం అనుకున్నట్టు కాకుండా– ఆ రోజు పోలీసు వాన్‌లు మూడు వచ్చి ఆగి వున్నాయి. ఇనపటోపీల మనుషులు లారీల్తోనూ దిగి నిలబడివున్నారు.

వానలో అక్కడంతా రద్దీగావుంది.

ఒకేసారి జనం అంతా తోసుకు తోసుకు వస్తున్నారు పెద్ద వూరేగింపులా. వూరేగింపుకు ముందు రంగసామి కేకలు వేస్తూ నడుస్తున్నాడు. వెనక్కాల జనాలు కొందరు జెండాలు పట్టుకొని ఆవేశంగా అరుస్తున్నారు.

దూరంగా వున్న ట్రిక్షులు రావటానికి జాగా లేక అక్కడే వుండి పోయాయి.

మెల్లిగా కొట్లు తెరుచుకొన్నాయి.

మనుషులు బరువులు ఎత్తుకొంటున్నారు.

కాసేపటికి మొదలయింది పెద్దగొడవ- చాలమంది ముసిలివాళ్ళను తోసేసారు కొందరు 'ఎళ్ళు ఎళ్ళు' అంటూ. బరువులు ఎత్తుతున్న వాళ్ళలో చాలామంది కొత్త వాళ్ళున్నారు.

"ఏటిది ?" అన్నాడు రంగసామి.

"తమ్మూ మన్దేవూరు ?" అన్నాటి చిట్టి.

"బరంపురం-" అన్నాడు.

"ఎంతమందేటో ?" అసడిగాడు చిట్టి.

"ఉండరా- ఓ మూడునాలుగొందలు మురా" అన్నాడు.

"దొంగ లంజికొళ్ళు- తీసినోళ్ళకి పనియ్యరన్నమాట-" అన్నాడప్పల్రాజు.

"బాబొరే, దొబ్బేమంటున్నార్రో-" అంటూ ఏడుస్తున్నాడు గురవయ్య నేలమీద చతికిల పడిపోయి.

అందరికీ మోసం అర్థమయిపోయింది- బరంపురం నుంచి జనాల్ని తెచ్చి కొచ్చారు- ఎత్తుకొన్న సరుకులు దభీమని కిందపడిపోయాయి. మనుషులు కిందపడ్డారు.

"ఏటా అక్కరమం ?" అన్నారు కొందరు.

అప్పుడొచ్చాడు నల్లబాబు- "ఆడి నెందుకు తోసావ్" అన్నాడతను.

"నువ్ ఆడి బాబువా-" అన్నారెవరో. ఆ తర్వాత సోడాబుడ్లు పగిలాయి- మనుషుల వొళ్ళు చిట్లిపోయింది- నల్లబాబు చేతులకు రక్తం అయిపోయింది. వంద మంది దాకా రక్తం చిట్లించారు.

కాసేపటికి పోలీసు వాళ్ళొచ్చారు.

మూడునాలుగు వేనుల్లోనూ సరిపడ జనంని తీసికెళ్ళిపోయారు.

"మేం కొట్లు తెరుచుకొని యాపారం చేస్కొందామంటే, పనోళ్ళని అరెస్టు చేసుకుపోయారు" అని చంద్రశేఖరం పోలీసు స్టేషన్‌లో అన్నాడు.

ఆ తర్వాత వాళ్ళు కొంతమందిని వుంచి మిగతావాళ్ళను వొదిలేసారు.

* * *

"ఏటి మనుషులంతా జాగా కాడకు రావడం మానీసి, రోడ్లంబటా, స్టేషన్లం బటా తిరుగుతుంటే ఏటి బలం?" అన్నాడు రంగసామీ.

"మరి జనాలు తిండిలేక సావరా లేకుంటే—" అన్నాడు చిట్టి.

"నువ్వేటి పెద్ద లీడరయి పోయావేటి? మేం సావలేదే?" రంగసామికి చిట్టి మీద ద్వేషం పెరుగుతోంది.

"యూనియన్ వాళ్ళు కానోళ్ళను గాలి కొగ్గేస్తున్నావ్, అదేటి న్యాయం?"

"ఆళ్ళకు మనవేటీ సెయ్యలేం— లేబర్ రూల్సున్నాయి— ఆటి ప్రకారమే మనం పోరాడాలి— నీకు బుద్ధి తక్కువా తొందరెక్కువా అనుత్తినే అన్లేదునేను."

"చస్ నీయమ్మ, నోర్మూసుకోరా—"" అంటూ చిట్టి వెళ్ళిపోయాడు.

"చావండి, బజారు మూసిపారదొబ్బారు— తిండ్లేక చావండ్రా— నేను యూని యన్ కోసమే చూస్తాను— యూనియన్‌లో లేనోళ్ళ గురించి నేన్మాటడను— చావండి" అన్నాడు రంగసామి గట్టిగా సిగరెట్టు దమ్ము పీల్చి వదుల్తూ.

* * *

వారం అయింది.

చిట్టికి జ్వరం వస్తోంది.

దానికితోడు నిన్న జనం అంతా దిగాలు ముఖాలు వేసుకొచ్చారు— కొంతమంది నేలమీద కూర్చుండి పోయారు— కొంతమంది విపరీతంగా ఏడుస్తున్నారు.

"చిట్టిబాబూ, పేణాలు పోతున్నాయి మాకా కూలి నేదు— రచ్చించే మొగుడే లేడు— బస్సుల్లో కసింత పస్చేసి ఓ రొట్టిముక్కయినా తిని ఇన్ని టీ నీల్లు తాగుదా మంటే దానికీ పేదే కొట్టాద్రా నాయనా...."

చిట్టి కంగారుగా లేచి నిలబడ్డాడు; "ఏటయింది ఆళ్ళు పోమ్మన్నారా?"

"ఆళ్ళు పొమ్మన్లేదు, ఇయేళక్కడికి బస్సోనర్లంతా తయారు- క్లీనర్లందర్నీ దెంగులుపెట్టారు- మాచేత బస్సులు కడిగించటం లాంటి పన్లవీ చేయించుకొంటే ఆళ్ళనీ పనుల్లోంచి పీకేస్తాం అన్నారు- నల్లబాబుగాడో పదిమంది జనాల్తో దెబ్బలాట కూకుర్చున్నాడు- ఏటి సేస్తాం సెప్పు?"

"ఏటి సేసినా జనం అందరం ఒక్కటవాలి- మనల మనం అమ్ముకొని ఆళ్ళకు బానీసలవం" అన్నాడు చిట్టి.

మధ్యానం నుంచీ వాన పడ్తోంది.

గుడిసెల్లో మధ్యన మోకాలు లోతుకి నీళ్ళొచ్చేసాయి- అంతా చీదర చీదరగా తయారయింది.

ఉదయం అయేసరికి అక్కడ గుడిసెల్లో ఉన్నవాళ్ళకి చాలామందికి జ్వరాలొచ్చాయి. వాంతులయ్యాయి- కొంచెం దూరంలో ఉన్న ఛారిటీ మిషను వాళ్ళు రెండు మూడు అంబులెన్సులలో మనుషులందర్నీ తీసికెళ్ళారు.

నీలమ్మకూడా వాంతుల్లా అయ్యాయి- కడుపులో విపరీతమయిన నొప్పి.
సాయంత్రంకి పదిమంది చచ్చిపోయారు- నీలమ్మతో నలుగురు ఆడవాళ్ళు.
"పొట్టల్లో ఏవీ లేదు- అరగని గడ్డి తప్పించి" అన్నారు డాక్టర్లు.

* * *

రంగసామికీ చిరాగ్గావుంది.

కోరుకున్న వాటిలో ఏవీ నెగ్గేలా తనకు అన్పించటంలేదు. బరువులు తగ్గించటం మా జేతుల్లో లేవంటున్నారు. అదీకాక చిట్టి వ్యవహారం అతనికి మంటకలిగిస్తోంది. అందుకే అతనన్నాడు.

"ఇయాల్టితో ఈ తగువు తేలిపోవాల. లేపోతే జరిగే గొడవలకు నాను సమాదానం కాదు" అని- చంద్రశేఖరంకి గుండెల్లో రాయిపడింది. అటు గవర్నమెంటు సాయంవచ్చేలా అతనికి కనబట్టంలేదు. ఇటు రంగసామి తంతు చూస్తే 'అరాచకం'కి దారివొదిలేసేలావున్నాడు.

"అంటే ఏమిటి?" అన్నాడు చంద్రశేఖరం.

"ఇయాళతో యూనియన్‌కీ మీకూ రాజీ కుదర్టం మంచిదని. యూనియనోళ్లందరూ మండి పడ్తున్నారు."

"మీరు రూల్సు ప్రకారం మాట్లాట్టంలేదు. మాదగ్గిర పనోళ్ళు కానోళ్ళందరికీ బోనసేమిటి?"

"అన్నీ మీరు చేసిన గందరగోళాలేనాయె– వారానికీ పదిరోజులకీ మనిసిపేరు మార్చేసి ఆడు మా పనోడు కాదంటారు మీరు."

"రంగసామీ, ఒకటే మాట– యూనియన్ వోళ్ళందరికీ బోనసిస్తాం– ఐదేళ్ళుగా ఒకేచోట పన్చేస్తున్న వోళ్ళకి మాత్తరం ఇస్తామంటాం. బరువుల గురించి గవర్నమెందోళ్ళకు రాస్తాం– పోతే బస్తాకి ఐదేసి పైసలు కూలి రేటు పెంచుతాం–" అన్నాడు చంద్రశేఖరం– అతనికీ తెల్సు అంతకన్నా తెగకొట్టటం కష్టం అని– యూనియన్‌తో ఏ వప్పందం పెట్టుకొన్నా గొడవలు తగ్గిపోతాయని అతని నమ్మకం.

"యూనియన్ వాళ్ళ తరపున మేం కోపరేట్ చేస్తాం– మిగతా వోళ్ళకి నే గారంటీ ఇవ్వలేను" అన్నాడు రంగసామి.

"చిట్టిబాబు నీ యూనియన్ వోడేగదా–"

"ఆడ్ని నీనెప్పుడో బయటోడికింద జమకట్టేశాను" అన్నాడు.

"ఆడేదయినా గోలచేస్తే బాధ్యతెవర్ది–"

"నాది కాదు."

• • •

బజారు తెరిచారు.

పని దొరికిందేచాలని దరిద్రులంతా పరిగెత్తారు.

యూనియన్ వప్పందం కొచ్చేసిందని అందరికీ తెల్సింది.

బజారంతా హడావిడిగా వుంది.

సుంద్రావు పార్టీ వర్కర్లతో స్వయంగా బరువులు ఎత్తుతూ పని ఆరంభం చేసాడు.

చిట్టి జ్వరంతోనే వెళ్ళాడు.

"బాబోరే దొబ్బేమంటున్నార్రో–" అంటూ ఏడుస్తూ వచ్చాడు గురవయ్య. అతన్తోపాటు చిట్టితో తిరిగిన వాళ్ళందరూ ఏడ్పు ముఖాలు వేసుకొచ్చారు.

"మాకు సొమ్ములూ లేవు పనీ లేదు ఏటి సిట్టిబాబూ–" అన్నాడు అప్పల్రాజు.

చిట్టి యూనియన్ రూమ్ వైపు పరిగెత్తాడు.

లోపల రంగసామి తాపీగా సిగరెట్టు తాగుతున్నాడు.

"ఏటి గురూ– బోనస్ దొరికిందేటి?" అన్నాడు చిట్టిని చూస్తూ.

"ఛఫ్ లంజకొడకా, తార్పుడు నా కొడకా– జనాలందరి పొట్టలు కొట్టి ఏటి నీ వప్పందం–" చిట్టి రంగసామి లాల్చీ పట్టుకోని రూమ్ బయటకు ఈడ్చుకోచ్చేశాడు.

"ఏంటిది, వొదులు వొదులు, పిచ్చట్టిందేటి–" అనరిచాడు రంగసామి.

"పిచ్చి సికురా అట్టింది."

రంగసామి ముఖంమీద నాలుగు గుద్దులు పడ్డాయి.

కాసేపటికి అక్కడంతా జనం పోగయిపోయారు– మనుషుల్లో మనుషులు కొట్టుకొన్నారు.

"ఒరేయ్ అప్పల్రాజూ–" అనరిచాడు చిట్టి.

అప్పటికే నల్లబాబు రంగసామిని చిట్టి చేతుల్లోంచి విడిపించేశాడు– అతని చేతుల్లో ఉన్న చాకు చిట్టి ముఖాన్ని చీరేసింది– పొట్టలోంచి రక్తం చిమ్మింది– చేతులు ఎర్రగా ఏడుస్తూ రక్తాన్ని కారుస్తున్నాయి.

అప్పల్రాజు పరిస్థితీ అలానే వుంది– అతను తిన్న దెబ్బలకు స్పృహ తప్పిపోయాడు.

"లంజ కొడుకుల్లారా– మనిషిని సంపితే జనం సల్లపడిపోర్రా– ఒరేయ్ తమ్ముళ్ళూ జడవకండి. ప్రళయం వచ్చీవరకూ మనం ఒకటీ అరా ఇట్లా రాలిపోతూనే వుంటాం. జడవకండి–" అరుస్తున్న అరుపు ఆగిపోయింది.

జనంకి చిట్టి రక్తం బీభత్సంగా కన్పిస్తోంది.

•　　　•　　　•

మర్నాటి నుంచీ మనుషులంతా బరువులు మామ్మూలుగా ఎత్తుతూనే వున్నారు.

•　　　•　　　•

విప్లవాలకు ముందు చెదురుమదురుగా మొలకెత్తే నిప్పుకణాలు గాలికి ఎగిరిపోతూనే వుంటాయి– నిప్పుకణాల్ని ఎగరగొట్టి బూడిదగామార్చే గాలే, మంటను పెద్దది చేస్తుంది.

సాహిత్యం లోబడి ఉండడమూ, ఈ లోబడిఉండే పద్ధతి రెండూ రెండు విరుద్ధ విషయాలు. ఈ రెంటినీ గందరగోళపరచి మార్క్స్, ఎంగెల్సుల భావాల్లో పరస్పర వైరుధ్యం ఉన్నదనే భావన కలిగేటట్లు రచయిత్రి వ్యక్తీకరణ ఉంది. ఇది విషయాలను గతితార్కికంగా కాక యాంత్రికంగా అవగాహన చేసుకోడం నుండి ఏర్పడుతుంది. ఉదా॥కు 26 పేజీలో రెడవ, మూడవ పేరాలు, 28వ పేజీలో మొదటి పేరా చదవండి. "తొలి దశలో మార్క్స్, ఎంగెల్సులు చేసిన ఇలాంటి సూత్రీకరణలూ, వ్యాఖ్యానాలూ కళాసాహిత్యాలను ఆర్థిక విషయాలకు అధీనం చేసాయి." (26వ పేజీ) "రాజకీయ, మత, సాహిత్య అభివృద్ధి, ఆర్థిక విషయాలమీద ఆధారపడి ఉన్నా, ఈ ఒక్కటే వాటన్నిటినీ శాసించడం బదులు, ఆర్థిక అవశ్యకతమీద ఆధారపడిన పరస్పర చర్యా, ప్రతిచర్యలు ఉంటాయని, అంతిమంగా ఈ ఆర్థిక అవశ్యకత బయల్పడుతుందని ఎంగెల్సు అన్నాడు." (28వ పేజీ) ఇవి రెండూ ఒకదాని కొకటి Complement మాత్రమే.

"చెన్ యీకి మావో రాసిన లేఖ" నిర్దిష్టమైన ఆధారాలు చూపకుండా "నలుగురి ముఠా ప్రతీప భావాలను పడగొట్టేందుకు" ఏ రకంగానూ పనికిరాదు. "నలుగురి ముఠా" అని చెప్పబడేవాళ్ళు "రూపవాదు"లని ఎవరిని ఏ ప్రాతిపదికపై అన్నారో నిర్దిష్టమైన వాస్తవ సమాచారం లేకుండా లేఖపై వ్యాఖ్యను ప్రచురించడం రెండుపంథాల మధ్య పోరాటంలో పుకార్లను వ్యాపింప చేయడమూ, రివిజనిస్టు పద్ధతి అవుతుంది.

8–9–78

– మొలీనా

గత నెల రుద్రజ్వాల గారి "భూమికోసం" రచనలో కొన్ని 'పొరపాట్లు'గా నాకనిపించినవి రాస్తున్నాను. "అమ్మ"ను గురించి ప్రెసిడెంట్ మాట్లాడే మాటలు సమంజసంగా లేవు. "పేదల మనిషిని" అని ప్రజలను నమ్మించిన 'అమ్మను' "ఒరే యెవురమ్మను కుంతన్నారు?.... మా అమ్మరా" అని ప్రజలను దోచుకునే వ్యక్తి, ఎప్పుడూ 'నిజం' చెప్పడు. ఇంకా వారిని బూటకపు సోషలిజంలో ఉంచడానికే ప్రయత్నిస్తాడు. ప్రజలపై తాముచేసే కుట్రను అసలు బయటపెట్టరు. 51 పేజీ చివరలో ప్రెసిడెంట్ వచనం కూడా సమంజసంగాలేదు. ఏ భూస్వామీ తన తొత్తుతో ప్రజల ఎదుట 'అలాంటి' మాటలు మాట్లడడు. అలాగే ప్రెసిడెంట్ వద్దనున్న దాపీదు అంత త్వరగా "నువ్వూ మాలో ఒహడివే. మా కడ్డం వత్తావా?" అని సింగన్న అనగానే ప్రజలవైపు మారడం అసమంజసం, అసంభవం కూడా!

మొత్తంమీద రచయిత మంచి కథతో, మంచి భాషతో ఈ యక్షగానం రాశాడు. అయితే, నేనా పైన చెప్పిన లోపాలు ఇందులో చాలాఉన్నాయి. అది నా అభిప్రాయం.

విప్లవాభినందనలతో—

– 'అమరశిల్పి' గద్వాల్

SRJANA Telugu Monthly Oct. 78 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67